

# BSA బియస్ఎ సైకిల్ తొక్కుతూ వెళ్లండి

ప్రఖ్యాతమైన బియస్ఎ-అతి తేలికైనది-బలిష్ఠమైనది-అతి వేగంతో కూడినది-తిరిగి వచ్చింది. జగద్విదితమైన సాంస్కృతిక సౌందర్యము బలిష్ఠముకూడిన బైక్ ఉత్సాహ పూరితులైన యువకులు సునాయాసంగా సైకిల్ తొక్కే ఆనందాన్ని తిరిగి కలిగించడానికి ఇది మళ్లీ నిర్మింపబడింది. ప్రపంచంలో ఈ దేశమందు మేలిరకపు సైకిళ్లను చేసేవారిచే ఇది కీర్తి కల్గిన అధిక ప్రమాణాలకు అనుగుణ్యంగా ఇప్పుడు తయారు చేయబడింది.

టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53
ప్రొప్రైటర్లు : ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు.

## బైక్‌నుగురించి ఆలోచిస్తున్నారా ? బియస్ఎని జ్ఞాపకం ఉంచుకోండి





బియస్ఎ మీ ఇంటికి భూషణము

JWT/TIC/BSA/2949

# ఉత్తరాలు

ముఖచిత్రం

ఈమధ్య పాత, కొత్త ముఖాల ముఖచిత్రాలు, లోపల వాటికిదగ్గ చిత్రిత చిత్రాలు పత్రిక విలువకు గీటు రాళ్ళుగా ఉంటున్నాయి. 11—2—66 సంచికలో 46 పేజీలో వ్యాసమూ, దాని గురించి 'సంపాదకీయం'లో ప్రస్తావన చూస్తే కొంచం 'ఇది' గానే వుంది. ఏదో చిత్ర వార్తల్లో ఫలానా వేషధ్య గాయకుని పెళ్లిళ్లి పెళ్లి లాగానో, ఫలానానటి పిన్నమ్మకూతురి చదువులాగానో ఉండేదానికి అంతరార్థం ఏమా?

జి. సుబ్రమణ్యం ('రాజేంద్రనగర్')

కథలు

22—1—66 తారీకు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన సుమిత్రాదేవి రచన "మూసిన కిటికీ" కథ చాలా బాగుగా ఉన్నది.కాని మాధవి చంద్రం బావ మరదళ్ళు. చంద్రం గుడ్డివాడు. వైజ్ఞానిక పరిణామాల వలన కన్నులను మార్చవచ్చునని తెలిసు కొని మాధవి చంద్రం కళ్లను డాక్టరుకు పరీక్ష చేయించ మాధవి డాక్టరు అయి బావ కళ్లను బాగు చేయుటకు పరిస్థితులు విషమించినవి. చంద్రం చనిపోవటం విషాదకరంగా చూపించనది.

చిట్లూరి జగన్నాథరావు (జలూరు).

* * *

రెండు వారాలు పత్రికలో వేసిన "మంచితనం" కథ చాలా బాగుంది. అందులో అన్న మనస్తత్వం, అన్నకోసం తమ్ముడు త్యాగం చేయబోవటం, చివరికి ఎవ్వరి త్యాగాలతోను అవసరం లేకుండా కథసుఖాంతమవ్వటం, నిజంగా కథ ఎంతో ఉత్కంఠతో నడిచి, ముందేమి జరుగుతుందో తెలియకుండా, చాలా చక్కగా నడిచింది కథ.

వై. అనసూయాదేవి (గుంటూరు)

* * *

"యామిని"గారు రచించిన "హింస" చక్కని శైలితో "రాజశేఖరం", పార్వతి" ల మధ్య అనుబంధమును ఎంతో చక్కగా చిత్రించేరు. కథను ముగింపు నా హృదయాన్ని ఎంతగానో కదలించివేసింది. రాజశేఖరం పాత్రద్వారా పురుషులపై పున్న దురభిప్రాయమును తొలగించేరు. ఇంత చక్కని కథను వ్రాసినందుకు రచయితకు, అది పత్రికలో ప్రచురించి చదివే అవకాశమును కలిగించిన మీకు నా అభినందనములు.

కె. ఆదినారాయణమూర్తి, యం. విజయకుమార్ (నాశ్లైరు)

యామిని గారి "హింస" చదువరుల హృదయాలను నిజంగానే హింసించింది. కథను ఒక విధంగా మంచి రంజులో ముగించినా, అమాయకురాలైన ఆ పార్వతికి ఒక పరిష్కారమంటూ చూపించి ఉన్నట్ల యితేయింకాబాగుండేది.రాజశేఖరం యిదివరలో ఎంత కాలం మనోహింసకు లోనైనా, తదుపరి పార్వతి పశ్చాత్తాపపడి చేసిన పరిచర్యలకు అతడు తృప్తి పడలేకపోవడం కొంచెం సహజదూరం. అతడి డయూరీ చదవడం పెద్ద నేరమేమీ కాదు.అమాత్రం ఆడదాని మనసు వర్థం చేసుకోలేనివాడు అసలింత కాలం ఆమె యెడల ఉదాసీనం వహించి యుండే వాడు కాదేమో!

పి. సావిత్రి (బొంబాయి)

* * *

'కరివేపాకు' కథ చదవగానే ఈ ఉత్తరం వ్రాయాలనిపించింది. 'కరివేపాకు' లాంటి కథలు ఇటువంటి పత్రికలలో ప్రచురించడం సమంజసంగా లేదు. కరివేపాకులో ఏవిధమైన సాహిత్యభావం ఉందో నాకేమీ బోధపడలేదు. ఇలాంటి కథలనే పొగడుతూ కొందరు పాఠకులు ఉత్తరాలు వ్రాస్తుంటారు.

జి. గోవింద్ చౌదరి (బళ్లారి)

* * *

ప్రభంజనంగారి "మానవుడా! జయం నీకు" కథ చదివాను చాలా బాగుంది. కాని ప్రాణానికి ప్రాణంగా చూచుకుంటున్న సుబ్బారావుపై పెద్దా పుకు గల కోపానికి, నారాయణమ్మ కొడుకు సత్తి బాబు మరణానికి, సుబ్బారావు భయానికి గల కారణాలు, సంబంధా లేమిటో ఎంత చదివినా అగమ్యగోచరంగా, అర్థరహితంగా ఉన్నవి.

సిరీజాన్ (గూడూరు)

* * *

11—2—66 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నటసామ్రాట్ శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గురించి వ్రాస్తూ, వారి నాటకాలతో మద్రాసుకు మంచి రోజులు వచ్చాయని శ్రీ ధర్మాజీగారు వ్రాయుట బాగాలేదు. వారి నాటకముందు మద్రాసుకు మంచిరోజులు లేవనా? వారి అర్థం ఏమిటోకాని వారు ఇలా వ్రాయుట చూస్తే ఏదో ద్వేషముతో వ్రాశారని మాత్రమే చెప్పవలసివస్తుంది. ఇక ముందు ఈలాటి అసభ్యకరమైన విషయాలు వారపత్రికలో ప్రకటించుటలో తగు జాగ్రత్త వహించెదరని నా మనవి.

వి. అమరలింగాచ్చారి. (చంద్రగిరి)

* * *

తెలుగుదేశ చరిత్రలో ముఖ్యస్థానాన్ని ఆక్రమించుకున్న "పల్నాటియుద్ధం" చిత్రం ఆధారంగా తీసుకుని మీరు ప్రచురించిన కథ చాలా బాగుంది. నాకు ఒక చిన్నసందేహం. రచయితగారు మైలమాదేవికి నలగామరాజా, భూరమాదేవికి కామరాజా, నరసింహరాజా, పుట్టిరాజా, పెరుమాళ్లు జన్మించారని వ్రాశారు. కాని చిత్రంలో కనిపించేది నలగామరాజా మరియు నరసింహరాజా మాత్రమే. పిర విద్యాదేవికి చిన మలిదేవరాజా, పెద్దమలి దేవరాజా ఇద్దరు పుత్రులని సంభాషణలవల్ల తెలుసుకోనవలసి వదేగాని చినమలి దేవరాజా చిత్రములో ఎచ్చటా మనకు కనిపించదు.

చినమలి దేవరాజును, పెరుమాళ్లరాజును పుట్టిరాజును చూపించడం అవసరము కొన్నారేమో మరి దర్శకులు.

జి. తిప్పన్నచౌదరి (బళ్లారి)

## తెలుగు భాషాసమితిప్రకటన

తెలుగు భాషా సమితి కార్యదర్శి పద్మభూషణ మోటూరి సత్యనారాయణగారు ఇలా ప్రకటిస్తున్నారు: "లాభాల దృష్టి పెట్టుకుండా, కేవలం సేవా లక్ష్యంతో ప్రజా మాన్యంలో సర్వే సర్వత్రా విజ్ఞాన ప్రచారం చేయడానికై ఇదే దృక్పథంతో ప్రజలూ, ప్రజా నిధులైన ప్రభుత్వమూ, ప్రజాక్షేమకాంక్షులైన ప్రముఖులూ అవ్యాజంగా అందించిన ధన సహాయంతో తెలుగు భాషా సమితి తలపెట్టిన పదుహారుసంపుటాల విజ్ఞాన సర్వస్వం ప్రణాళికలో పదిసంపుటాలు వెలువడి సిద్ధంగా ఉన్నవి. ఇంకొక సంపుటాలే రావలసి ఉన్నాయి. అవి తయారవుతున్నాయి. సాధ్యమైనంత త్వరలోనే వెలువడనున్నాయి. ఇప్పటికి వెలువడినంత వరకూ ఈ సంపుటాలు కాదరణ బాగానే పొందినాయి. ఈ కృషి ఫలించినందుకు భాషా సమితి చాలా సంతోషిస్తున్నది. అయితే అందరికీ ఆయా దిశలూ అత్యవసరమైన ఈ విజ్ఞాన ఖాండాగారాన్ని ఒకే మొత్తంగా కొని తెప్పించుకోలేక కొందరు నిరాశిస్తున్నారు. సూచాయగా తెలిసి, వారున్నంతలోకల సర్వస్వాలను కూడా దీనిని అందుబాటు చేయుట సమితి ఒక ప్రణాళిక తలపెట్టింది. ప్రజలకు కల్పించిన అనుకూలంలో ప్రజలను పదుహారసంపుటాల ధర్మముని దానికి సంకల్పించింది. ముందుగా ధర్మ వ్యక్తి లేకుండా మొత్తంగా కాకా ముందుకు ముందే గానే తెప్పించుకోనొచ్చని, తాపీగా వెనక వాయిదాల రూపంలో ధర చెల్లించే పథకం ప్రవేశపెట్టింది. వరుసుకోండి. సావకాశంగా డబ్బివ్వండి అనేదానికొన్ని వదుపాయాలు కూడ ఇవ్వదలచింది. ఏ ఎక్కడా కవి వివి ఎరూవి ఈ సరికొత్తయోజనను—కొత్త సంవత్సరపు పండుగవేళ పాటిని— సమయం మించకుండా వినియోగించుకొని ఆంధ్రులందరూ హర్షిస్తారని నమ్ముతున్నది. వివరాలకు తెలుగు భాషా సమితి, 71 యూనివర్సిటీ బిల్డింగ్సు,మద్రాసు—5 అడ్రసుకు వెంటనే వ్రాయండి.

(8 వ పేజీ కూడా చూడండి)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 1—4—'66

విశ్వావసు సం॥ చైత్రమాసం శుద్ధ॥ దశమి

సంపుటము: 58  సంచిక: 31

స్థాపితము:

1908

*

ముఖ్య సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు:

శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము

7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్రవారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా |
|---|---|
| | రూ. పై. |
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు

ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర సంవత్సర చందా | 12.25 |


వచ్చేవారమే!



నేనూ - మద్రాసు!

నటుడు నాగేశ్వరరావు అభిప్రాయాలు

# మనలో మాట

కాలంతోపాటు మనం మాట్లాడేభాషలో కూడా ఎన్నోమార్పులు వస్తున్నాయి...తెలుగుభాషకూడా అదేవిధంగా ఎలా మార్పు చెందుతున్నదీ వివరించే వ్యాసాన్నొకదాన్ని యీ సంచిక పదో పేజీలో వేస్తున్నాం...వ్యాసకర్త శ్రీ మహీధర నళినీమోహన్ మా పాఠకులకు సుపరిచితులే...

*   *   *

ఈ వారం 'న్యూఢిల్లీలేఖ'లో మా ప్రతినిధి శ్రీ కృష్ణ వాణిజ్యానికి సంబంధించిన కొన్ని ముఖ్యాంశాలను చర్చించారు. ఇటీవలనే జరిగిన వాణిజ్య సదస్సు నొకదానిని గురించికూడా ఆయన వ్రాసిన అభిప్రాయాలు 76వ పేజీలో మొదలవుతాయి.

*   *

'నిరీక్షణ' సీరియల్ గత వారమే ప్రారంభించాం... 'కరుణ' సీరియల్ ముగింపుకు వస్తున్నట్లు మా పాఠకులు చాలామంది యీపాటికే గ్రహించి వుంటారు.

*   *   *

'సినిమారంగం'లో తారలమీద 'గ్రహబలం' ప్రభావం చాలా ఎక్కువే నంటారు వ్యాసకర్త శ్రీ సి. పైడిరాజు. ఇందుకు సంబంధించిన వ్యాసం 53వ పేజీలో ప్రారంభం అవుతుంది... వ్యాసకర్త అభిప్రాయాలతో సంపాదకులుగాని, ఆంధ్రసచిత్రవారపత్రికగాని ఏకీభవించనవసరంలేదు.

*   *   *

ముఖచిత్ర సుందరి కుమారి కృష్ణకుమారిని గురించి సచిత్ర వ్యాసం 50, 51 పేజీల్లో చదువవచ్చు!

వచ్చేవారం సంచికలో వుండే ఆకర్షణ ఏమిటో యీ పేజీ చూస్తేనే తెలుస్తుంది!

# విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'పాదుకా పట్టాభిషేకం'లో కృష్ణకుమారి


అటు చూడు! వాళ్లెంత బరువులు మోస్తున్నారో!
ఆర్థిక మంత్రి ఆశలు!
పన్నుల భారం


ప్రేమకు తుది ఘట్టం!


రంగులు మార్చే చిరుతపులి!
రష్యా

న్యూఢిల్లీ లేఖ

# భారత వాణిజ్యమండలుల సమాఖ్య చర్చలు

గతవారం న్యూఢిల్లీలో భారత వాణిజ్య మండలుల సమాఖ్యవారు మూడు రోజుల కార్యక్రమం ఏర్పాటు చేశారు. విదేశీ దౌత్య ప్రతినిధులు దానికి హాజరు కావడం, ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ప్రారంభోత్సవం చేయ ఎం అందులోని ముఖ్యాంశాలు. ...ర విషయాలను చర్చించేందుకేర్పా ... ఈ సభలకు పదవీ విరమణ చేసే, పదవీస్వీకారం చేసే అధ్యక్షులిద్దరూ పక్కపక్కన క్కూర్చుని అధ్యక్షత వహిం చారు. పదవీ విరమణ చేసే అధ్యక్షునిచే రూపొందింపబడి, ఆమోదింపబడిన తీర్మా నాలను చర్చల్లోకి తెచ్చారు. అవన్నీ ఏక గ్రీవంగా ఆమోదింపబడ్డాయి. లంచ్— మీటింగ్స్ ఈ చర్చల్లో ఇంకొక ఆకర్షణ. స్వాతంత్ర్యానికి పూర్వం, సమాఖ్య ప్రారంభదశలో ఉన్నప్పుడు, చర్చలకు గవర్నర్ జనరల్ కార్యాచరణ సంఘం ...్యులు హాజరై ప్రభుత్వ విధానాల్ని వివ రించేవారు. తర్వాత సమాఖ్యలోని బ్రిటిష్ వ్యతిరేక శక్తులు అంతమొందించిన ఈ పద్ధతి స్వాతంత్ర్యానంతరం కూడా తిరిగి ప్రవేశించలేకపోయింది.

బ్రిటిష్‌వారి హయాంలో ఎసోసియేటెడ్ ఛేంబర్స్ ఆఫ్ కామర్స్ వార్షిక చర్చలకు వైస్రాయి ప్రారంభోత్సవం చేసే వారు ఆయన ఉపన్యాసం ప్రభుత్వ విధా నాన్ని సూచించే అంశాలను కలిగి, భవి ష్యత్తుని సూచించే విధంగా ఉండేది. సమాఖ్య అధ్యక్షుని ఉపన్యాసాన్ని -దానికి సంబంధించిన శాఖలకు పంపి అభిప్రాయ సేకరణ జరిపేవారు. దానిమీదే వైస్రాయి ఆమోదం ఆధారపడి ఉండేది.

కీర్తిశేషులైన నెహ్రూ దాని రూపాన్నే ...గా మార్చేశారు. ఆయన ఎప్పుడూ ...ద్ధంగా తయారుచేసి ఉంచుకున్న ఉప న్యాసాన్ని యివ్వలేదు. కాబట్టే ఆయన ఉప న్యాసంలో 'విధానం' అనేదే లేకుండా ఉండేది. మతధర్మోపన్యాసంలా, ప్రజాస్వామ్య ...్యవాదాన్ని ప్రబోధించే సూక్తుల్లా ఉండేవి ఆయన ఉపన్యాసాలు.

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి తమ ఉపన్యాసంలో ప్రభుత్వ విధానాలను, ప్రణా ళికాభివృద్ధిని సమర్థిస్తూ మాట్లాడ టానికి ప్రయత్నించారు. శ్రీమతి గాంధీ, పదవీ విరమణ చేస్తున్న అధ్యక్షుడూ, దేశంలో అస్తవ్యస్తంగా ఉన్న ఆర్థిక పరి స్థితిని గురించి చెప్పకుండా చాకచక్యంగా మాట్లాడారు.

చైనా దురాక్రమణ జరిగినతర్వాత కూడా శ్రీ నెహ్రూ మూడవ ప్రణాళిక 'చివర'ల ను కత్తిరించటానికి కూడా ఒప్పుకోలేదు. ప్రణాళికాబద్ధమైన పురోగతే రక్షణలో ముఖ్యమైన భాగం అన్న కొత్త వివాదం ఒకటి రూపొందింప బడ్డది. శ్రీ మొరార్జీ దేశాయి ఈ త్రోవనే నడిచి పన్నుల భారంతో బయటపడ్డారు ప్రణాళికకూ, రక్షణకూ వీలు కల్పించ డానికి, తర్వాత వచ్చిన యిద్దరు ఆర్థిక మంత్రులకూ రాబడిని ఎక్కువ చేయా ల్సిన ఆవశ్యకత కలిగింది 1963 లో ప్రపంచ బ్యాంక్ రాబోయే పరిస్థితులను గూర్చి హెచ్చరిక చేసింది.

కీర్తిశేషులైన నెహ్రూ పంచశీలను నమ్ముకుని దేశరక్షణ విషయాన్ని పూర్తిగా విస్మరించారు. రక్షణ మంత్రిత్వ శాఖ, 1961 లో న్యూఢిల్లీలో జరిగిన పారిశ్రామిక ప్రదర్శనలో, ఏర్పాటుచేసిన 'స్టాల్' లో మామూలుగా కొనుగోలు దారులు వాడుకునే వస్తువులు ప్రదర్శిం చారు. దాన్నిబట్టి చూస్తే ప్రయివేటు రంగంలోని పరిశ్రమల్తో ఆర్డినెన్స్ ఫ్యాక్ట రీలు పోటీపడ్తాయన్నమాట పదిహేనేళ్ల పాటు నిర్లక్ష్యం చేసిన దేశరక్షణను సుప టిష్టం చేసుకోడానికి తగినంత సమయం, చాలినంత డబ్బూ అవసరం ఆర్థికంగా దేశం ఇబ్బందుల్లో ఉన్నప్పటికీ స్వాతంత్ర్య పరిరక్షణ కోసం రక్షణ కృషి కొనసాగుతూనే ఉండాలి. దారిద్ర్యాన్ని వీలైనంత త్వరగా రూపు మాపాల్సిన అవ సరం ఉన్నప్పటికీ భారత స్వాతంత్ర్యానికి అన్ని సమస్యలకన్నా ప్రథమ స్థానం ఇవ్వా ల్సిన అవసరం ఉంది. ఇదే ఆచరణీయ మైతే అభివృద్ధిని, కనీసం ప్రాముఖ్యత అతగా లేనివాటినన్నా, తగ్గించడమన్నా చేయాలి ప్రభుత్వం. మరోవిధంగా చెప్పా లంటే రక్షణకు పోగా మిగిలిన ధనాన్నే ప్రణాళికకు ఖర్చుచేయాలి.

ప్రధాని మంత్రి శ్రీమతి గాంధి భారతదేశం ఆర్థిక పరిస్థితిపై ఖచ్చితమైన సూచనేమీ చేయలేదు. ఎన్నికలు దగ్గర పడిన సమ యంలో ఏ ప్రభుత్వమూ పన్నుల భారాన్ని ఎక్కువ చేయదని ఆమె చెప్పిన మాట వాస్తవమే.

అలాంటి హానికరమైన పన్నులైనా ప్రజలకు అంగీకారంగా ఉండాలి. వ్యక్తు లపై పది శాతం పెంచినా, సంస్థలపై అయిదు శాతం పెంచినా ఆ పన్నుల ద్వారా కొన్ని లక్షల మంది నిరుద్యోగు లకు ఉద్యోగావకాశం కల్పించే విధంగా ఉంటే ఎన్నికలపై అంతగా దాని ప్రభావం ఉండదు. ఎన్నికల సందర్భంలో ఏ ప్రభుత్వమూ ప్రణాళిక పరిమాణాన్ని తగ్గించదు, అది కాంగ్రెస్ ఎన్నికల ప్రచా రానికైతే తప్ప. ప్రణాళికాకారులు ఇంకా పెద్ద ప్రణాళికను రూపొం దించి ఉండవచ్చు నిజమైన ప్రణాళిక నూటికి నూరుపాళ్లు అమలు జరుగు తుంది ఆకర్షణీయంగా ఉండే ప్రణాళిక నూటికి అరవై వంతులు అమలు జరుగ టానికి వీల్లేని పద్ధతిలో ఉంటుంది. తద్వారా భారత ఆర్థిక పరిస్థితిపై తీవ్రమైన దెబ్బ తీస్తుంది.

ప్రణాళిక పరిమాణాలు కావి, దారి ద్ర్యాన్ని రూపు మాపుతామని స్థిరంగా చెప్పే ఖబుర్లు కావి ఎన్నికల్లో కాంగ్రెసు గెలిచేలా చేయలేవు వచ్చే ఏడు కాంగ్రెసు పరిపాలనలోకి రావటానికి హామీ యివ్వ కలిగింది ఆర్థిక స్థిరత్వమొక్కటే.

ఇండియా ఆర్థిక పరిస్థితిని మెరుగు

ఏర్పటానికి రిజర్వు బ్యాంకు గవర్నర్ కొన్ని పద్ధతులను సూచించారు. ఆ పద్ధతులు ఆర్థిక స్థిరత్వాన్ని సాధించడానికి సరైనవి గానే ఉన్నాయి. ప్రభుత్వం తన ఖర్చును తగ్గించుకోవాలన్నది కూడా ఆయన చేసిన సూచనలలో ఒకటి.

సమాఖ్య 'ఆర్డర్ పేపర్' మీద ఆరు తీర్మానాలు ఉన్నాయి. అవి పారిశ్రామిక విధానం, ధనవిధానం, పెట్టుబడి మార్కెట్ విధానం, రవాణా విధానం కుటుంబ నియంత్రణం. వీటిలో ఏవీ శ్రీ కిర్లోస్కర్ ప్రసంగంలో కన్పించలేదు.

"మనకి బయటి నుంచి ఎక్కువ పోటీ లేదు. ఇక్కడ మన అమ్మకందారుల మార్కెట్‌లోనే ఎక్కువ వ్యవహరిస్తాము. దానికి ఫలితంగా అస్తవ్యస్తత, దుబారా, అసమర్థతలను సోర్చుకోవాల్సిన అవసరం ఉంది. చాలా పరిశ్రమలు ధరలను గురించి ఆలోచించేదే లేదు. తప్పైన ప్రపంచమంతా ఎప్పుడో వదిలిపెట్టిన నిర్వాహక పద్ధతు

# న్యూఢిల్లీ లేఖ

లను, సూత్రాలను మనం మాత్రం విడనాడ వాడలేదు. ప్రపంచంలోని ధరలతో పోలిస్తే మనవి చాలా ఎక్కువగా ఉన్నాయి. పన్నులు ధరల్ని మరింత పెంచుతాయి. చక్కని నిర్వహణ పద్ధతులు, తెలివితేటలు ఉపయోగిస్తే ధరలు తగ్గటానికి అవకాశం ఉంది.

"వ్యాపారస్తులుగా మనం ఎగుమతులను అధికం చేయడానికి అశక్తులం" అన్నారు శ్రీ కిర్లోస్కర్ తమ ప్రసంగంలో.

* * *

'ఎమోకో' వారి సహకారంతో మద్రాసులో ఒక ఎరువుల ఫాక్టరీ స్థాపించాలనే నిర్ణయం జరిగింది. అది యూరియా, కాంప్లెక్స్ ఎరువులను తయారు చేస్తుంది. ఈ పథకంవల్ల సాలుకు 20 లక్షల టన్నుల నైట్రొజన్, 85,000 టన్నుల ఫాస్ఫేట్, అంతే మొత్తంలో పొటాష్ తయారవుతాయని అంచనా. ఈ పథకానికయ్యే మొత్తం ఖర్చు 28.57 కోట్ల రూపాయల్లో 14.44 కోట్లు విదేశీమారక ద్రవ్యం.

ఇలా స్థాపించబడిన ఈ కొత్త కంపెనీలో 51 శాతం షేర్లు ప్రభుత్వానికి చెందుతాయి. మిగతా 49 శాతం ఎమోకో, ఇండియ ఇన్ కార్పొరేటెడ్‌కు చెందుతాయి. త్వరలోనే కంపెనీ స్థాపన జరుగుతుంది. ప్రభుత్వానికి 51 శాతం షేర్లు ఉండటం మూలాన అది ప్రభుత్వరంగానికి సంబంధించిన కంపెనీ అవుతుంది.

ధరలను నిర్ణయించడంలో స్వేచ్ఛ ఉండే ప్రభుత్వరంగంలోని కంపెనీలకు లాభదాయకమైనది. ఆ లాభాన్ని ప్రభుత్వమే పొందుతుంది. ధరల పెరుగుదలనుంచి కొనుగోలుదారునికి రక్షణ లభిస్తుంది. ఆర్థిక వ్యవస్థలో స్వేచ్ఛ ఉండటంవల్ల వాడకందారుని సామర్థ్యతనుమించి ధరలు ఎప్పుడూ పెరగవు.

—శ్రీకృష్ణ

# ఉత్తరాలు

(4వ పేజీ తరువాయి)

## ఉత్తర వియత్నాం

25—2—66 సంచికలో ఎ. ఎస్. ఆర్. ప్రసాద్ వ్రాసిన "ఉత్తర వియత్నాం" అనే వ్యాసము పాఠకదృష్టితోనూ పరస్పర విరుద్ధ విషయాలతోనూ —కేవలం కమ్యూనిస్టులంటే, వారి పోషకుల విధానమంటే నిహ్యాభావం కలిగించటాని ఉద్దేశించి వ్రాసినట్లుగా ఉంది. ఉత్తర వియత్నాం గురించి వారు వ్రాసింది బహు తక్కువ. అక్కడి పోషకుల విధానాల్ని విమర్శించటం బహు ఎక్కువగానూ ఉంది.

ఆ వ్యాసంలో దక్షిణ వియత్నాం, అమెరికన్ బాంబర్లతో ఉత్తర వియత్నాం సైనిక స్థావరాలపైన మాత్రమే విమానదాడులు జరుపుతున్నట్లు వ్రాశారు. కాని వాస్తవానికి అమెరికన్ దక్షిణ వియత్నాం విమానదాడులు ఉత్తర వియత్నాంలోని ఫేక్టరీలూ, రవాణా మార్గాలు, పంట పొలాలు పైనే మాత్రమే కాక జనసమ్మర్దమైన ప్రాంతాలమీద చివరకు పాఠశాలలమీద, వైద్యాలయాలమీద కూడ జరుగుతూ ఉన్నట్లు ఫోటోలతో సహా పత్రికలలో చూస్తూ ఉన్నాము.

కమ్యూనిస్టు దేశాలలో కస్టమ్స్ శాఖవారు పాస్‌పోర్టులూ హెల్త్ సర్టిఫికెట్లనూ క్షుణ్ణంగా పరిశీలిస్తారని పెట్టెలూ బేడలూ అన్నీ తెరచి పరీక్ష చేస్తారని వ్రాసారు. అయితే ఒక్క కమ్యూనిస్టు దేశాలలోనే కాక అన్ని దేశాలలోనూ యిది తప్పనిసరిగా జరిగే పనే. ఇందులో విడ్డూరమేమీ కనిపించటంలేదు. కెమెరా తీసుకొని వెళ్ళనివ్వరని రాసారు. కాని వ్యాసంతోపాటు రెండు ఫోటోలు కూడా ఉత్తర వియత్నాంవి ప్రచురించారు. అవి ఎలా తీసారో రచయితకే తెలియాలి. హనోయ్‌లో యితరదేశ రాయబార కార్యాలయంవారి కార్లు నాలుగో ఐదో తప్ప కార్లే కనుపడవని రాశారు. వారు పంపిన ఒక ఫోటోలో (కమ్యూనిస్టు రాజధాని హనోయ్ దృశ్యం) హనోయ్‌లోని ఒక విశాలమైన వీధి దృశ్యంలో చాలా కార్లు కనిపిస్తున్నాయి. యివన్నీ పాఠకులు పరిశీలించలేని పిచ్చివాళ్ళని వ్యాస రచయిత ఉద్దేశ్యం కాబోలు.

వియత్నాంలోని వారి జీతాలు ప్రభుత్వం నిర్ణయిస్తుందని రాసారు. ఆ జీతాలు అక్కడి జీవన ప్రమాణంతో పోల్చి చూసుకున్నప్పుడు ఎక్కువో తక్కువో ఏదీ చెప్పకుండా దాటవేసారు.

మొత్తంమీద వ్యాసమంతా చదివితే అది వియత్నాంలోని ప్రజలు, వారి ఆచార వ్యవహారాలు తెలుసుకునేటందుకు ఉపయోగపడేది కాకుండా కమ్యూనిస్టు విధానాన్ని అసహ్యకరమైనదిగా చూపించటానికి రాసినట్లుగా ఉంది. రచయిత పంపిన ఒక ఫోటోకు (కమ్యూనిస్టు రాజధాని హనోయ్ దృశ్యం) అని పేరు పెట్టబడింది. కమ్యూనిస్టు వ్యతిరేకతను ఆ ఫోటోకు పెట్టిన పేరు స్పష్టంగా తెలియచేస్తుంది.

హనోయ్ పట్టణం ఉత్తర వియత్నాంకు రాజధాని కాని కమ్యూనిస్టు రాజధాని అనటం అర్థంలేదు. కమ్యూనిస్టులకు ప్రత్యేకించి ఒక రాజధాని ఉంటుందా? లేక ఒక దేశానికి రాజధాని ఉంటుందా?

భోజనపదార్థాలు చాలా ఖరీదు అవుతాయి అని వ్యాసంలో రాసారు. కాని, ఒక ఫోటో కింద వియత్నాంలో హోటలు భోజనం చాలా చవుక, మనిషికి అరణాలకన్న అవదు. అని రాయబడింది. వ్యాసంలో చెప్పిందానికీ, ఫోటోకింద రాసినదానికీ పరస్పర విరుద్ధత ఉంది.

మనం కమ్యూనిస్టు వ్యతిరేకులమైనా కమ్యూనిస్టులను దుయ్యబట్టడానికి యిలాంటి వ్యాసాలను ప్రచురించటం న్యాయంకాదు.

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక అందుకు వేదికా కారాదు. ఈ వ్యాసం వాస్తవానికి కొంత దూరంగా ఉందని నే నభిప్రాయ పడుతున్నాను. యిలాంటి వ్యాసాలు యికముందు వారపత్రికలో ప్రచురింపబడవని ఆశిస్తాను.

పి. చంద్రశేఖర ఆజాద్ (కాకినాడ)

* ఫోటోలు కొంచెం పాతవి. అతికష్టంమీద సంపాదించి మాకు పంపినట్లు రచయిత రాశారు.

మహీధర నళినీమోహన్

# ఎంత తెలుగు!

"ఏ భార్య అయితే నన్ను ఆనందడోలిక లలో వూపుతుందని ఆశపడ్డానో, ఆ భార్యే నన్ను విడిచిపెట్టి పొరుగింటి పుల్లయ్యతో లేచిపోయాక ఇంక నాకీ జీవితం ఎందుకూ ?"

"ఏ కొడుకైతే తలకి కొరివి పెడతాడని ఆశ పెట్టుకున్నానో, ఆ కొడుకు కొంపకి కొరివి పెట్టేశాక...."

"ఏ కాళ్ళతో అయితే త్రిపాద నక్షత్రంలా వూరంతా బలాదూరుగా తిరిగేవాడినో, ఆ కాళ్ళు విరిగి మూల బడి పోయాక...."

ఇటువంటి వాక్య నిర్మాణం ఇటీవలి కాలంలో తరుచుగా కనబడుతోంది. ఇది చూస్తూ ఉంటే తెలుగేనా అనిపిస్తోంది. వాక్యరచన ఈవిధంగా చెయ్యడం తెలుగు సంప్రదాయం మాత్రం కాదు. ఇటువంటి పద్ధతి సంస్కృతంలోనూ, తజ్జన్యములైన ఉత్తరాది భాషలలోనూ ఉంది. బెంగాలీ, హిందీ పుస్తకాలు తెలుగులోకి అనువదించడం మొదలుపెట్టిన తొలి రోజులలో చక్కని తెలుగు వ్రాయాలనే పట్టింపులేని రచయితలు మూలంలో ఉన్నది ఉన్నట్లు ముక్కకి ముక్క వ్రాసెయ్యడం సాగించారు. దరిమిలాని అల్లా వ్రాయడమూ, మాట్లాడడమూ నాగరికత అనుకునే స్థితి వచ్చింది. ఇటువంటి వాక్యాలు లేని తెలుగు సినిమాయే లేదు. పై వాక్యాలను "తెలుగు" లో వ్రాయడం ఎల్లాగో చెప్ప నవసరం లేదనుకుంటాను. "ఈ వాక్యనిర్మాణాని కేమొచ్చింది ? మహారాజాలా ఉంది" అనుకొనేవారి కోసం మరొక్క ఉదాహరణ :

ఢిల్లీలో పుట్టి పెరిగిన మా బంధువుల పిల్లలు మాట్లాడే తెలుగుభాష వింటే ఈ ఎబ్బెట్టుతనం మరీ కొట్టొచ్చినట్లు కనబడుతుంది.

"ఎవరైతే నిన్న మధ్యాహ్నం వచ్చారో ఆయన మళ్ళీ వచ్చారు నాన్నా !"

"ఏ పుస్తకాని కయితే అట్ట చిరిగిపోయిందో ఆ పుస్తకం కనబడడంలేదు."

"వాళ్ళ నాన్న ఎవరైతే ఉన్నారో ఆయన పిలుస్తున్నారు" (ఇంకా నయం, "వాళ్ల నాన్నగా ఎవరైతే ఉన్నారో ఆయన" అనలేదు.)

* * *

ఈ మధ్యని తెలుగులో వస్తున్న రచన లలో ఒక చిత్రమైన ప్రయోగం కనిపిస్తోంది.

"అవధానిగారు తావళం తిప్పుకుంటూ జపం చేసుకుంటున్నారు. పార్వతమ్మ వంట పనిలో తలమునకలవుతోంది." ఒక పాత్రకు "గారు" చేర్చి బహువచన సత్కారము. మరో పాత్రకు ఆ గౌరవం అవసరం లేదు కాబోలు. ఇందులో కూడా ఒక పద్ధతి లేకపోలేదు. రచయితకన్న వయస్సులో బాగా పెద్దవి, ముసలివి, పెదమనిషి తరహా కలిగిన పాత్రలు అయితే, అవి మగవి కూడా అయిఉంటే వాటికి చివర "గారు" చేర్చి గౌరవించక తప్పదు. లేకపోతే ఆ పాత్ర మంచిదని చదివేవాళ్లకు తెలియడం ఎల్లా? ఆడపాత్రలు ఎంత మంచివైనా, ఎంత ముసలివైనా గౌరవించడం అనవసరం !

* * *

కొన్ని చిత్రమైన వాక్య నిర్మాణ పద్ధతులు ఇంగ్లీషులో మంచి తెలుగులోకి యథాతథంగా వచ్చిపడ్డాయి. అతి పరిచయంవల్ల అవి ఎబ్బెట్టుగా వినిపించడం మానేశాయి. ఉదాహరణకి :

"ఈరోజున సమ్మె చేయాలనే నిర్ణయం తీసుకున్నారు."

"టు టేక్ ఎ డెసిషన్" కి "నిర్ణయం తీసుకోవడం" అంటున్నారు. "నిర్ణయించారు" అంటే చాలదూ ?

"దీర్ఘంగా ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చాడు."

"టు కమ్ టు ఎ కంక్లూషన్" కి ఇది తెలుగుట.

"అది మరోలా జరిగినా ఆశ్చర్యపడ నక్కరలేదు."

"నన్ను అర్థం చేసుకో సావిత్రీ !"

"నన్ను అపార్థం చేసుకుంటున్నావు రఘూ !"

"నిన్ను ప్రేమిస్తున్నాను .... నన్ను ప్రేమించలేవా ?"

ఇవి అన్నీ ఇంగ్లీషు పలుకుబడికి యథానువాదాలే. ఇంగ్లీషుభాషతో పరిచయంలేని తెలుగువాళ్లు ఈ వాక్య నిర్మాణము ఇల్లా చెయ్యరు.

పండితుల మనుకునేవాళ్లు కూడా సంస్కృత భాషలో తల నెరసి, మగ్గిపోయి ఆ భాషా సంప్రదాయాలనే యథాతథంగా తెలుగులోనూ వాడేస్తూ ఉంటారు. పౌరాణికులు వాడే తెలుగుభాష దీనికొక చక్కని ఉదాహరణ :

"అప్పుడు దశరథుడు విన్నముడవు కుంటూ ..." ఇది సంస్కృతంలోని సన్నంత ప్రయోగాలకి కృతకమైన తెలుగు రూపం.

ఇతర భాషా సంపర్కంతో తెలుగు పలుకుబడిలో వచ్చిన మార్పులలో ఇవి కొన్ని మాత్రమే. సజీవమైన భాషకు మార్పు సహజం. కాదనడంలేదు.

అంతటితో అయిపోలేదు. సంస్కృత వ్యాకరణపు పద్ధతులు కొన్ని తెచ్చి తెలుగు వ్యాకరణం మీద రుద్దేశారు.

"తెలుగులో విభక్తు లెన్ని ?" అని అడిగితే ఏడు అంటారు. (సంబోధన ప్రథమ కూడా కలుపుకుంటే ఎనిమిది.)

అవును గానీ, తెలుగులో విభక్తులు ఏడే ఎందుకుండాలి ? "వలన, కంటె, పట్టి" వంటి ఒకదాని కొకటి సంబంధం లేని ప్రత్యయాలను తెచ్చి, గుదిగుచ్చి, ఒక వరుసలో ఎందుకు పడవేసినట్లూ ? దీనికి కారణం సంస్కృత వ్యాకరణంలో ఇల్లా ఉంది కనుక ! సంస్కృతంలో శబ్దాల చివరలు ఎనిమిది విధాలుగా మారుతున్నాయని గ్రహించి, ఒకే విధమైన అంత్యములు కలిగినవాటి నన్నింటిని ఒక

52 వ పేజీ చూడండి




రామారావు పంచె కొసతో కళ్ళు తుడుచుకున్నాడు.

క్రితంరోజు సాయంకాలం నుంచి అతన్ని ఒకటే ప్రశ్న ముల్లులా పొడుస్తున్నది. జోగయ్య తనతో చెప్పకుండా ఎందుకలా పారిపోయాడు ?

జోగయ్య తన మిత్రుడు. ప్రాణంలో ప్రాణం. వాడి మనసులో ఏదున్నా, వాడేం చేసినా తనతో చెప్పకుండా ఉండలేడు. అలాగే తనూను. పదో ఏట కాబోలు జత పడిన తమ స్నేహం అలా అలా బిగుసుకుపోయింది. నిన్న ఉదయం దాకా ఈ స్నేహపు వారధికి చెరియలికట్టి వదలేదు. ఒకటా రెండా? నలభై అయిదేళ్ళయి కొనసాగుతోంది తమ స్నేహం. ఇన్నాళ్ళూ ఆత్మబంధువుకంటే దగ్గరగా ఉండి ఇప్పటికిప్పుడు 'నువ్వెవరో నేనెవరో సుమా!' అన్నట్టుగా పారిపోయేడు.

వెదికి తీసుకువచ్చి ఒకసారి గట్టిగా చెవి మెలేసి సంజాయిషీ అడగడానికేనా వీలు కానంత దూరం పారిపోయేడు జోగయ్య.

రామారావు నీరసంగా అరచేతులు నలుపుకున్నాడు. కుర్చీలో వెనక్కి చేరబడి కళ్ళు మూసుకున్నాడు. లభ్యంకాని పని గురించి విచారించేకంటే, తనకందుబాటులో ఉన్న స్నేహపు డబ్బీని తెరిచి అందులో పరిమళాల్ని వాసన చూడటమే యుక్తంగా తోచింది.

.....'నేనివాళ బళ్ళోకి వెళ్ళనే అమ్మా' అని గునుస్తున్న రామారావుని 'ఏమయిందిరా నీకు?' అని అడిగింది తల్లి.

'నాకివాళ చాలా జ్వరంగా ఉందే'.

'అలాగరా, నాయనా' అని కొడుకు నుదుటిమీదా, బుగ్గలమీదా చెయ్యివేసి చూసిందావిడ. ఆవిడకి సంగతి అర్థమైపోయింది.

ఆరోజు రామారావు స్నేహితుడు జోగయ్య పంతులు, పండక్కి వాళ్ళ అక్కా బావా వచ్చేరని బడి మానేసి ఇంట్లో కూర్చున్నాడు. 'పండగ ఇంకా అయిదు రోజులుంది కదా. ఇవాళనుంచే సెలవు పెట్టేవెందు'కని రామారావు మిత్రుణ్ణి అడిగేడు.

'ఇవాళ ఒకరోజే మానేశాను బడి. రేపట్నుంచి వస్తాన్లే. నువ్వెళ్ళవేంటి ?' అన్నాడు జోగయ్య.

'ఎందుకు వెళ్ళనూ ? నాకే అక్కా బావలున్నారేమిటి పండక్కి రావడానికి, నేను బడిమానేయడానికీ.' అని దిగులుగా చూసేడు రామారావు. మిత్రుని చూస్తే జోగయ్యకేమిటో కష్టమనిపించింది.

'పోనీ, నువ్వూ బడిమానెయి ఇవాళ. మనిద్దరం మా ఇంట్లోనే ఆడుకుందాం, ఏం?'

అదీ రామారావు జ్వరానికి కారణం. ఒకరు బడిమానేస్తే మరొకరు మానే

యాలి. ఒకరికి వంట్లో నలతగా ఉంటే మరొకరు నలతని కొనితెచ్చుకుంటారు. అదో ముచ్చట..............!

ఏదో పనిమీద అగదిలోకి వచ్చి, పడక కుర్చీలో కళ్ళుమూసుకు కూర్చున్న తండ్రి పెదిమల మీద చిరునవ్వుని చూసి తెల్ల పోతూ వెళ్ళిపోయేడు రామారావు.

......'ఏరా రావుడూ ఇంకా కాలేజీకి టైమవలా?'

'అయింది నాన్నా.'

'మరి ఆగిపోయావేం?'

'ఇంగ్లీషు టెక్స్టు కొనాలినాన్నా'.

'అదేమిటూ? క్రిందటివారంలో కొన్నావ్?'

'అది పోయింది. క్లాసులో ఇంట్లో కూడా వెతికేను. కనిపించటం లేదు.' కొద్దిసేపు రామారావు మొహంలోకి చూసి మౌనంగా డబ్బు తెచ్చి ఇచ్చేడు తండ్రి.

పుట్టిన ఒక్కడూ తమవల్ల ఏలోటూ భరించటం ఇష్టం లేదాయనకి.

ఆరోజే జోగయ్యకి కొత్త ఇంగ్లీషు పుస్తకం తెచ్చి ఇచ్చేడు రామారావు.

జోగయ్య కళ్లలోకి అదివరకు లేని కాంతి వచ్చింది.

'ఇంక లెక్చెరర్‌గారి బోరు నీకు తప్పి పోతుందనుకుంటాను' అన్నాడు నవ్వుతూ. జోగయ్య మిత్రుడి రెండు భుజాలమీద ఆప్యాయంగా చేతులువేసి నొక్కాడు.

'వాడేకాదు. ఇంట్లో కూడా ఇహ ఎవ రికీ భయపడక్కర్లేదు. నీకు చెప్పకే గాని, అసలు జీతం కట్టేసరికే తల ప్రాణం తోకకి వస్తోంది. కొన్న పుస్తకాలు కూడా పోతుంటే నాన్న ఏమంటారో అని హడలి చచ్చేననుకో! నువు దేవుడిలా ఆదు కున్నావు గనక సరిపోయింది........' కృత జ్ఞత నిండిన కళ్లతో చూసేడు జోగయ్య.

'ఒరే నేను దేవుణ్ణికానురా,నీరామారావుని!'

'పోనీ అలాగే అనుకో.'

పుస్తకం కొనగా మిగిలిన చిల్లరడబ్బు లతో హోటల్‌కి వెళ్లేరు మిత్రులిద్దరూ. ఈ ఉపకారాన్ని మర్చిపోలేదు జోగయ్య. తల్లిదండ్రులు అవకాశం ఇచ్చినంతమట్టుకు సంతృప్తిపడి ఇంటరుతో చాలించి ఉద్యోగాల్లో బుర్రలు దూర్చేరు ఇద్దరూ.

జోగయ్య టైపు పరీక్షకట్టి పాసయి గవర్నమెంటు ఆఫీసులో టైపిస్టు, రామారావు టీచరు ట్రెయినింగు అయి మేస్టరు గిరితో కుదురుకున్నారు.

పెళ్లిళ్లయ్యేయి. సంసారాలు, వాటితో బాధ్యతలూ, బరువులూ పెరిగేయి. బాదర బందీలు ఎలావున్నా వాళ్లు ఒకరిని ఒకరు ఏ నిముషం ఏమరిచి వుండేవాళ్లు కారు. రామారావు అరికాల్లో ముల్లు విరిగితే జోగయ్య ప్రాణం విలవిలలాడేది. జోగయ్యకి ఒకనాడు జ్వరంవస్తే ఆరో జంతా రామారావు బడికి శెలవు పెట్టేసి మిత్రుడి దగ్గరే కూర్చున్నాడు.

ఏసుల్లోకి వెళ్లి వచ్చేక సాయంకాలం పార్కులోనో, ఈశ్వరుడి గుడిమండపం లోనో చేరి పోతారు ఇద్దరూ. రోజూ కలుసుకునే వాళ్లకి మాటలేముంటాయి. సంసారాలు— లేమి—ధరలు—రాజకీయాలు—యుద్ధం గొడవలు— చీకటిపడటం— ఎవ రిళ్లకి వాళు వెళ్లడం.

మనిషైపుట్టేక ఇబ్బందులు అనుభ వించడం అసాధారణం కాదు. కానీ—ఇంత సానుభూతి, సహృదయం లభిస్తే ఎన్ని కష్టాల్లో కూడా ఊరట కలుగుతుంది. ఈ ఊరటే కొరవడితే మనిషి మనిషిలా బ్రతకలేడు. జీవితంలో మూడొంతులు దిగజారిపోతాడు.

బండెడు కష్టాలు రవంత సానుభూతితో సమసిపోతాయి లేదా చల్లబడతాయి. అందుకే రామారావు, జోగయ్యలు ఎప్పుడూ తమకున్న వ్యక్తిగత ఇబ్బందుల్ని ఇబ్బం దులుగా లక్ష్య పెట్టుకోలేదు. మనఃక్లేశం పొందలేదు.

తనువులు వాలించేదాకా ఒక్కలాగే సాగిపోతుంది తను స్నేహసరళి అని పడిన గర్వం ఏమయింది. ?!.....

చెవులు అదిరిపడేలాగ గోడగడియారం పన్నెండు గంటలు కొట్టడంతో రామా రావు ఆలోచనలు ఆగిపోయేయి. భుజం మీదున్న కండువాతో నుదుటిమీద దట్టంగా పట్టిన చెమట తుడుచుకుని తలెత్తాడు. గుమ్మం దగ్గర భార్య మసక మసగ్గా కనిపించింది.

"అన్నానికి రండి."

రామారావు నెమ్మదిగా పడకకుర్చీ లోంచి లేచేడు.

"మీరివాళేమిటో సరిగ్గా తినటం లేదు." రామారావు భార్య కాంతమ్మ అన్నది అబద్ధంకాదు. అతను పెట్టిన అన్నం పెట్టినట్టే విస్తట్లో అటూ ఇటూ కెలికి నాలుగు మెతుకులు కలిపి అపోస నపట్టేశాడు. కండువాతో మొహం తుడుచుకుని గదిలోకి వచ్చేశాడు.

"మీరివాళ ఏమిటో సరిగ్గా తినటం లేదు." భార్య విసిరిన గులకరాయితో మనసు స్థిమితం తప్పి మళ్లీ సుడులు తిరిగింది.

క్రితంరోజు బడినుంచి వస్తూ రాఘ వులి కిళ్లీ బడ్డీలో సోడా తాగుదామని పించి అటు వెళ్లేడు. సోడా అందిస్తూ రాఘవులు మరొకరితో చెబుతున్న కబురు రామారావుకి మొదట అర్థమవలేదు. తరువాత చకితుణ్ణి చేసింది. "ఏమిటది రాఘవులూ?" అని అడిగేడు. వాడు ఆశ్చర్యంగా చూసి "అదేంటిబాబూ! ఇంతా మీకూ తెలవదా గంటకిందేగా పోయిందీ ఆయన" అన్నాడు.

"ఏమిటి. ఎవరు? ఎవర్నిగురించి నువ్వం టున్నావు? సరిగ్గా చెప్పు" రామారావు గాభరాతో వాడూ కిందుమీదయిపోయేడు.

"అసలు ఉదయంనుంచి ఒంట్లో సరిగ్గా లేదట. అలాగని ఇంట్లో చెప్ప కండా ఆఫీసుకి వెళ్లేరట. మధ్యాహ్నం ఒంటిగంటా అయ్యాక రిక్షా కట్టించు కుని ఇంటికి వచ్చేసేరట. ఎప్పుడూలేంది ఆయన రిక్షాలో రావడంచూసి ఇంట్లో వాళ్లు అంతా పరిగెత్తుకు వచ్చేరట. రిక్షా దిగుతూనే సొమ్మసిల్లి పడిపోయిన పంతులు గార్ని ఇంట్లోకి తీసికెళ్లేరట. ఏం జ్వరమో, ఏంటో. ఇందాక మూడు గంటలికినోట్లోంచి నురగలావచ్చి వూరుకున్నాడట. మహాను భావులు పంతులుగారు. రోజూ ఈదారమ్మటే వెళ్తూ వక్కపొడి కొనుక్కు వెళ్లేవారు.

రామారావు ఆ కబురు వింటూనే ఒక్క నిముషంమాత్రం అక్కడ నిల్చో గలిగాడు.

"ఆ! ఏవిటీ.....వాడే.....వాడికే ఈ ఘోరం!'' అనుకుంటూ ఒళ్లంతా చెమట్లు దిగజారుతుంటే, వూడిపోతున్నపంచెకట్టుకుని ఓచేత్తో పట్టుకుని అలాగే పరిగెత్తేడు.

ఆవీధి మొదటికి చేరుతుండగానే గొల్లు గొల్లున ఏడుపులు వినిపించేయి. దాంతో రామారావుకి కాళ్లు ముందుకి పడలేదు. బండకొయ్య వేసినట్టయింది. అతి కష్టం మీద జోగయ్యపంతులు ఇల్లు చేరు కున్నాడు. ఇంటి మెట్లు ఎక్కుతుంటే ఒళ్లు వణికింది.

ఆదృశ్యం చూస్తూనే రామారావు కొయ్యబారిపోయేడు.

జోగయ్య కళేబరాన్ని నేలమీద వో తాటాకు చాపపరచి పడుకోపెట్టేరు. వోపక్కన ఖాళీ గంగచెంబు పడివుంది. రాగాలు పెట్టేవాళ్లు పక్కన రాగాలు పెడుతుంటేకొందరలాగే పాడెకట్టే ప్రయత్నం చేస్తున్నారు. అంతా కలగాపులగంలా వుంది. అందర్నీ చోటు చేసుకుంటూ చలనం లేని జోగయ్యపంతుల్ని చలనం ఉండీ లేనట్టున్న రామారావు సమీపించేడు.

"దారిద్ర్యంనుంచి తప్పుకున్నాడు. అదృష్టవంతుడు. మనకింకా ఎన్నాళ్లుందో శేషం'' ఎవరో అన్నారు.

"కాదండీ మరీ. వెళ్లిపోయేదాకా వో పూట పని చేసుకు మరీపోయేడు. అలా

# మిథ్య

అందరికీ కుదురుతుందా?''

"ఒచ్చేవా నాయనా. ఆఖరిసారి నిన్ను అడిగేడుసుమీ. 'వాడు బళ్లో ఉంటాడు. ఎందుకు అనవసరంగా కబురు పంపించి వాడిని హడల గొట్టడం అసలే గుండె నిబ్బరంలేని మనిషి' అని నీ గురించి అను కోవడం నేను విన్నాను. పోయి గంట పైగానే అయింది. నేను ముందూ, వాడు వెనకా అవవల్సింది. తారుమారు చేసేశాడు నాయనా దేవుడు'' జోగయ్య తల్లి అంటూ విగ్రహంలా కూర్చున్న రామారావువేపు విస్తుపోతూ చూసింది.

రామారావుకి నమ్మకం కలగక జోగయ్యని ముట్టుకుని చూశాడు. చల్లగా తగిలింది. కళ్లలోంచి ప్రాణం పోయింది. తెరిచిన ఆ కళ్లలోకి చూసే సాహసం కలగలేదు.

వెదురుకర్రలు, తాళ్లూతెచ్చి పాడె కట్టేశారు. బిందెలతో నీళ్లుతెచ్చి శవానికి స్నానం చేయించేరు. కొత్త పంచె చుట్టబెట్టి నుదుటిన కుంకం పెట్టేరు. చాపతో జోగయ్యని ఎత్తి పట్టుకుని పాడెమీదికి చేర్చేరు.

కాస్సేపట్లో పాడె వెళ్లిపోతుంది— కాదు జోగయ్య వెళ్లిపోతాడు శాశ్వతంగా తనకి సంబంధించిన, సంబంధించని వాళ్ల దగ్గర సెలవు తీసుకుని!

ముంచుకొస్తున్న దుఃఖాన్ని బలవంతంగా అదిమిపట్టేడు రామారావు.

సమయానికి జోగయ్య అన్నగార్లు లేరు. వాళ్లు ఎక్కడో పనులు చేస్తున్నారు. కబురందీ రావడానికి రెండు రోజులు పడుతుంది. జోగయ్య తండ్రి అతనికంటే ముందే వెళ్లిపోయేడు.

పనిమీద ఆపూరువచ్చిన జోగయ్య బావమరిది ఒకవేపు—ఆ మహారాజుని ఎత్తితే జన్మ తరిస్తుంది అంటూ తయారయిన రాఘవులు ఒకవేపు—మరొకరు— నాలుగోవేపు ఆలోచించకండానే ఎత్తుకున్నాడు రామారావు.

మరోసారి ఆ ఇంట్లోంచివచ్చే ఏడుపుల మధ్య పాడె కదిలింది.

మిత్రుణ్ణి తనలో ఐక్యం చేసుకుంటోన్న అగ్నిదేవుడికి వో నమస్కారంపెట్టి ఇక ఆగకండా అక్కడినుంచి వచ్చేశాడు రామారావు. ఎలా వచ్చేడో అతనికే తెలీదు.

అయిపోయింది జోగయ్యకీ తనకీ ఋణానుబంధం. వాడి జీవాత్మ పరమాత్మలో కలిసిపోయింది.

ఇంక తను ప్రతీ సాయంకాలం కష్టం సుఖం ఎవరితో చెప్పుకోవాలి? భార్యవలన, పిల్లలవలన దొరకని మనశ్శాంతి, ఆదరణ, అనురాగం జోగయ్య సామీప్యంలో దొరుకుతాయే! అవన్నీ ఇంక ఏవీ?

జోగయ్యా! నాకంటే ముందు వెళ్లిపోయేవు. పోతున్నప్పుడు కనీసం కబురేనా పంపేవుకావు. కాకిలావొచ్చి నీముందు వాలుదునే. జీవనరసం ఇంకిపోని నిన్ను కళ్లారా చూసుకుందునే. నీ నోటిమీదుగా చివరి రెండు కబుర్లూ జాగ్రత్తగా నా డైరీలో అట్టే పెట్టుకుందునే. ఎంత పనిచేశావు!

అయినా—నిన్న మధ్యాహ్నందాకా ఉన్న వాడు మరో గంటకిలేడు. తన బతుక్కి మాత్రం గ్యారంటీ ఏమివుంది? అనుకున్నాడు రామారావు.

* * *

అప్పుడే సంధ్యావందనం పూర్తి చేసుకుని సావిట్లోకి వచ్చిన రామారావుకి వీధి

'బిట్టే... అటక మీంచి జాడీ
దొర్లిపోయింది
బిటతీసిందేమో
చూడు

సత్యమూర్తి

గుమ్మంమెట్లు ఎక్కుతున్న వెంకన్నశాస్త్రులు గారు కనిపించేరు.

"రండి. రండి" ఆహ్వానించేడు.

"చిన్నబ్బాయిచేత కబురుపెట్టేరుట. ఎందుకో. నిన్న రాత్రి నేను ఇంటి కెళ్లే సరికి మావాళ్లు చెప్పేరు."

"అవునౌను. అలా పదండి గదిలోకి."

గదిలోకి వెళ్లి తలుపులు దగ్గరికి చేర వేసేడు. చాప పరిచి "కూర్చోండి"అన్నాడు. అంతకుముందే పెట్లోంచి తీసి సిద్ధంగా పెట్టుకున్న జాతకం శాస్త్రులుగారికి ఇచ్చేడు.

"మరేంలేదు. వోసారి ఇది చూసిపెడతారని. మీకిప్పుడేంతొందర పనులులేవు కద?"

"అబ్బే. ఏంలేవు" శాస్త్రులుగారు జాతకం తీసుకుని పావుగంటసేపు చూశారు. ఏవో లెక్కలుకట్టి వేళ్లు మడిచి పైన దూలాని కేసిచూస్తూ అన్నారు మెల్లిగా.

"గురుడు కేంద్రమందున్నాడు. కుజ, శని, రాహువులు ఫరవాలేదు. అయితే....."

"అయితే?" రామారావు చప్పున అడిగేడు.

"అహ. అంతా బాగానే కనిపిస్తోంది. పోతే మూడు మాసాల్లో కొద్దిమార్పు. అంతే. ఒంట్లో కాస్త నలత చెయ్యవచ్చు"అన్నారు శాస్త్రులుగారు.

"అంతేనంటారా. ఇంకేమయినా?"

"అబ్బెబ్బే. ఘమ్మగా ఉందండీ, మీకేం? అసలు మీ జాతకంలో మీ కొడుకుల్లో ఒకళ్లు పెద్ద పేరూ డబ్బూ గడించి, తద్వారా మీరు కారులోంచి కాలుకింద మోపనక్కరలేని అమోఘమైనదశ పట్టేలా కనిపిస్తోందండీ"

"దానికేంలెండి. అంతదాకా వచ్చేసరికి నేను మీరూ ఉంటామో ఉండమోగాని."

పెంకు లెగిరిపోయినట్టు నవ్వేరు శాస్త్రులు గారు.

తీరని సందేహంతోనే తాంబూలం దక్షిణ ఇచ్చి ఆయన్ని పంపించేడు రామారావు.

"ఎందుకో శాస్త్రులుగారు వచ్చినట్టున్నారు" అంది లోపల్నుంచి వచ్చిన కాంతమ్మ.

"ఎందుకూలేదు. తోచక వోసారి కబురంపేను. కాఫీ చేశావా?" మాట మార్చేడు.

కాఫీ తాగి కూర్చున్న రామారావుకి శాస్త్రులుగారిమాటల్లో నమ్మకం కుదరడం లేదు. 'శాస్త్రులు బాగానే చూసేడను కుంటాను. ఎందుకు చూడడూ అయిదు రూపాయలూ పుచ్చుకుని? మారకదశవుంటే చెప్పడా? అయినా ఏమిటో గొణిగేడు. సరిగ్గా చూసేడో లేదో! అమధ్య కళ్ల తణిక్కి ఆస్పత్రికివెళ్తే అక్కడ ఈయనా తయారయ్యేడు. ఏమిటి సంగతీ అంటే ఏముంది వో కంట్లో పువ్వేసింది. ఆరు నెలలుపోతేగాని పువ్వు ఎదగదు. ఆపరేషను చెయ్యడానికి వీల్లేదన్నాడు డాక్టరు అని చెప్పేడు కూడా!'

రామారావుగుండె గుబ గుబలాడింది. నిష్కారణంగా ఇచ్చేను అయిదు రూపాయలూ. కూర ఖర్చుకేనా పనికివచ్చు నా డబ్బు అని విచారించేడు. కాస్సేపు గడిచేక, పోతేపోయింది వెధవడబ్బు ప్రాణానికి తాపి లేకుండా పోతోందిగద! అని కుమిలి పోయేడు.

రాత్రి రామారావుకి నిద్ర సరిగ్గా పట్టలేదు. కలలు 'కలలు అన్నీ పీడకలలే. ఏదో పెద్ద జబ్బు చేసింది'. 'ఇది చాలా ట్రబుల్ కేసు. ఆపరేషన్ చెయ్యాలి. చేస్తే ఈ వయసులో ఈయన బ్రతకడం కష్టం అంటున్నాడు' డాక్టరు.

ఆ ముక్కతో రామారావుగుండె బేజారెత్తిపోయింది. అప్పటికప్పుడే అతనికళ్లలో మృత్యువు నీడలు కదిలేయి. రామారావుకి వచ్చినది ఈ దేశంలోవున్న ఖరీదైన జబ్బుల్లో ఒకటి. మా ముత్తాతకిలేదు. తాతకి, నాన్నకిలేదు. నాకేమిటీ ఖర్మం? అని విలవిల లాడేడు. మందులతో, ఫీజులతోనే సంబంధం కలిగున్న డాక్టరు కర్మం ప్రసక్తి వచ్చేసరికి వింతగాచూసి మీ ఇష్టమైతే ఆపరేషన్ చేయించుకోవచ్చు అన్నాడు. ఆపరేషన్ చేయించుకోకపోతే జబ్బు ముదిరి కుళ్లుతూ ఎలాగూ చావాలి. ఆ దుర్భరమైన చావుకంటే, డాక్టరు మెత్తని చేతుల్లో అంతకంటే మెత్తని కత్తులతోనే చస్తాను అని పీచు పీచుమంటున్న ప్రాణంతో ఆపరేషన్ బల్ల ఎక్కేడు రామారావు.

క్లోరోఫామ్ ముక్కుదగ్గర పెడుతున్నప్పుడుఆఖరుసారిగా జోగయ్యని తరవాత వెంకన్నశాస్త్రులుగారిని తలచుకున్నాడు.

అంతే!ఒక నల్లటి తెరపడింది కళ్లముందు. తరవాత రామారావు బొందెలోంచి అతని జీవుడు నెమ్మదిగా లేచి వచ్చేశాడు. ఏడుపులు గొల్లులు, గొడవ అంతా గజిబిజిగా అయిపోయింది......రామారావు శరీరాన్ని హాస్పటల్ నుంచి ఇంటికి తెచ్చేశాక కాటికి తీసుకు పోవడానికి ఇంట్లోవాళ్లు సర్వసన్నాహాలూ చేస్తున్నారు.

రోజూ రామారావు బడినుంచి రాగానే సావిట్లో వో వాలుకుర్చీలో కూలబడేవాడు. అందులో కూర్చుంటే అతని కెంతో హాయిగా ఉంటుంది ప్రాణం. ఇవాళ రామారావు చచ్చిపోయేడని అతన్ని నేలన వో చాప మీద పడేశారు. ఆ కుర్చీలోనేనా చేరవేస్తే వాళ్ల సొమ్మేంపోతుంది? అది తను కొనుక్కున్నదేకదా. ఇంతే ఈ మనుషులు. ఆ గాలి కాస్తా ఒంట్లోంచి పోయాక ఎవరి కెవరో?! అనుకున్నాడు ఆ గదిలోనే తిరుగాడుతున్న రామారావు జీవుడు.

"శవాన్ని ఇంట్లో ఉంచడానికి వీల్లేదు. బైట పడేయండి. అంతసేపు మీరా శవాన్ని పెట్టుకు కూర్చుంటే మాకూ పిల్లలికీ ఇవళ భోజనాలు ఉండాలనా? వద్దనా?" అని రంకెలు పెడుతున్నాడు ఆ ఇంటిగలాయన. మంచం ఎలానూలేదు. కుర్చీ అసలేలేదు. ఒంటిన గుడ్డలు లాగేశారు. తను అద్దె ఇచ్చుకుంటున్న జాగాలో కూడా ఉండడానికి వీల్లేదుట! వాపోయాడు రామారావు జీవుడు. తరవాత అంతా గందరగోళం. మంటలమధ్య తను!......

రామారావు పెడుతున్న కేకలుతో ఉలిక్కిపడి లేచిపోయిన కాంతమ్మ పిల్లలు పరిగెత్తుకుని వచ్చేరు.

"ఏమిటి నాన్నా ఆ కేకలు?"

"ఏమిటండీ ఆ అరుపులూ? ఏవేనా పీడకలొచ్చిందా? మిమ్మల్నేనండీ" పెళ్లాం పిల్లలూ కుదుపుతుంటే, "ఆ! ఆ! ఏమిటి? ఏం జరిగింది? మీరా" అంటూ రామారావు లేచి కూర్చున్నాడు.అతని శరీరం యావత్తూ చెమటతో తడిసిపోయింది. తన చుట్టూ చేరిన అందరి మొహాల్లోకి తేరిపారచూసి

"అబ్బ! మీరెవన్నా రా? అయితే నేనూ....." అన్నాడు రామారావు నిట్టూర్చుతూ.

"అసలేమయింది నాన్నా?" అన్నారు పిల్లలు.

"ఏం కాలేదర్రా. ఏదో వెధవ కల" పిల్లల్ని పంపించి కాంతమ్మ అతనిదగ్గర కూర్చుని అడిగింది. "అసలేం జరిగింది చెప్పండి నాకు."

"చెప్పేందు కేముంది కాంతం?"

"అలా అనకండి. మీరేదో దాస్తున్నారు. జోగయ్యపంతులుగారు చనిపోయిన దగ్గర్నుంచీ మీరు మీరులాలేరు. నేనంతా గమనిస్తూనే ఉన్నాను. ఉదయం శాస్త్రులు గారిని రమ్మని, ఎందుకని నే నడిగితే మాట తప్పించేశారు. ఇప్పుడు......"

"కాంతం!"

"ఏమిటో మీ ప్రవర్తన నాకే బోధ పట్టంలేదు. ముప్ఫయ్యేళ్ళ కాపురంచేసినదాని దగ్గర కూడా దాచవల్సినంత గుట్టు ఏమిటి? నేనేమంత విషం అయిపోయాను మీకు?"

రామారావు వూపిరి బలంగా వదిలేడు. పైట చెంగుతో కళ్ళు తుడుచుకుంటున్న భార్యని చూస్తుంటే జాలి పుట్టుకొచ్చింది. రెండు చేతులు భార్య భుజాలమీదవేసి ఆవిడ కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు.

"కాంతం. ఒక్కమాట చెప్పు కాంతం. నేనులేకపోతే నువ్వూ పిల్లలూ జాగ్రత్తగా, ధైర్యంగా ఉండగలరా? అహ అంటే...."

"ఏమండీ! ఏమిటండీ ఇది....ఎప్పుడూ నేను ఏది లోలోపల వూహించి భయపడ తానో అది కాస్తా నిజమయి వూరుకుంటుంది. ఇది నా ప్రారబ్ధంలా వుంది" ఏడ్చేసింది కాంతమ్మ.

రామారావు నోరు మరి పెగల్లేదు. అత నేది చెప్దామనుకున్నాడో అది చెప్పనేలేదు. అతని సందేహాలు, అనుమానాలు, ఆరాటాలు పరిష్కారం కానేలేదు.

తెల్లవారిపోయింది!

ఆరోజు సాయంకాలం బడినుంచి వచ్చి ఇంక నాలుగు రోజుల్లో తను రిటైరయి పోతాడనే వార్త భార్య కందించేడు. ఈ కబురు చెబుతూనే తను అనదల్చుకున్నది అనేశాడు. "అయిపోయింది కాంతం. ఉద్యోగంలో రిటైరయిపోయాను. యింక జీవితంలో కూడా రిటైరయిపోతే......" భార్య అరుపుతో త్రుళ్ళిపడి అక్కడితో ఆపేశాడు.

రాత్రి అన్నం తింటున్నప్పుడు మళ్ళీ అన్నాడు. "జోగయ్య ఎలాటి మనిషి! పిచ్చుకలాగ ఉండేవాడు. వాడేపోయాడు. ఏమిటో ఇదంతా చూస్తుంటే మిథ్య అని పిస్తోంది. ఇవాళ ఉన్నవాడు రేపు ఉండడు. నువ మనగా ఎంత? మన బ్రతుకనగా ఎంత? ఏం గ్యారంటీ చూసుకుని మనం నిబ్బరంగా ఉండగలం చెప్పు కాంతం?"

ఏమిటి చెబుతుందావిడ? వెర్రిగా చూసింది. భార్య మవునంచూసి 'ఇదీ ఒప్పుకుంటోంది. అయినా ఈ నిజాన్ని కాదనే ధైర్యం ఎవరి కుంది?' అనుకున్నాడు రామారావు. మరి మజ్జిగ అన్నం మింగుడు పడలేదు.

రిటైరయినరోజు బళ్ళో తోటి టీచర్లందరి అభినందనల్ని పుచ్చుకుని, వాళ్ళు అభిమానంతో ఇచ్చిన చేతికర్ర, శాలువాని స్వీకరించి వచ్చేస్తూ బాగా పరిచయమున్న ఒక టీచరు దగ్గర పాతిక రూపాయలు బదులడిగి తీసుకున్నాడు రామారావు. అటునుంచి తిన్నగా బజారుకి వెళ్ళేడు. చీకటి పడుతున్న వేళప్పుడు ఇంటిముందు ఆగిన రిక్షా, దాని లోంచి రెండు సంచీలతో పళ్ళూ, కూరగాయలూ, బట్టల పాకెట్లతో దిగిన భర్తని చూసి కాంతమ్మ తెల్లబోయింది.

"ఏమిటండీ ఇవన్నీ?" అంది.

"లోపలికి పద ముందు చెబుతాను." తెచ్చినవన్నీ లోపల పెట్టేక కాళ్ళు కడుక్కుని, బట్టలు మార్చుకుని, పడక కుర్చీలో కూర్చుని పాకెట్లు విప్పేడు.

"ఇదుగో, ఇలా వచ్చి చూడు కాంతం. ఇది నీకు చీర. బాగుందా? ఇది నాకు పంచె. ఇవి, మరేంలేదు. బత్తాయిపళ్ళు, చవగ్గా ఉన్నాయని తెచ్చేను. కాస్త రసం పిండి తెస్తావూ? పిల్లలింకా ఇంటికి రాలేదులా వుంది. సరే. అవి లోపలికి పట్టికెళ్ళు. నాకు కొంచెం ఆయాసంగావుంది. పడుకుంటాను" కళ్ళుమూసుకున్నాడు రావు రామారావు.

పొద్దున్నే క్షణంలో గుండెల్లో నెప్పి వచ్చింది. భయంపుట్టి చేతులుగుండెమీద వేసుకు కూర్చున్నాడు. తరవాత అదే తగ్గిపోయింది. ఇప్పుడు మళ్ళీ ఆయాసంగా ఉంది. అయినా....ఏమో!.... ఎవరు చెప్ప గలరు?

అసలు జోగయ్య చచ్చిపోవడంవలన తనకీ దిగుళ్ళు అన్నీ వస్తున్నాయి. లేకపోతే ఎంత నిర్విచారంగా ఉండేవాడు!

"మీదింత పిరికి గుండె ఏమిటో నా కర్థం కావటంలేదు. ఒకళ్ళు చచ్చిపోయినంత మాత్రాన మరొకళ్ళు చచ్చిపోవాలని ఉందిటండీ? ఏదో గుబులు మనసులో పెట్టుకుంటే అదే చాలు మనిషిని తినేయటానికి. అన్ని అనర్థాలకీనూ. నామాటమీద నిఘా యించి చెప్పినట్టూ వినండి. మీరు హడలిపోయి మమ్మల్ని హడలగొట్టేయకండి" పళ్ళరసం ఇస్తూ అంది కాంతమ్మ.

రామారావు కోరిన ప్రకారం రాత్రి అతని కిష్టమైన వంటకాలు చేసింది కాంతమ్మ. పులిహోర, పాయసం, వంకాయమెంతికూర, ముక్కలపులుసు, అప్పడాలు—అన్నీ తృప్తిగా పెట్టించుకు తిని లేచేడు.

"రేపు లక్ష్మీపూజ చేసుకుని కట్టుకుంటానండీ" అన్న భార్యని పట్టుబట్టి 'ఇవాళరాత్రే నువ్వా చీర కట్టుకుని నాకు కనిపించాలి కాంతం' అన్నాడు గట్టిగా.

"ఏమిటో ఇన్నేళ్ళయిందిగాని ఏనాడూ నేను నీ సుఖం ఆలోచించేనుకాను. వంటగదిలో నువ్వా సెగతో అవతల్నుంచి వచ్చే కంపుతోనే చచ్చిపోతున్నావు. ఆ దొడ్డి మరమత్తు చేయిద్దాం అనుకోవడమే అవుతోంది ఎప్పటికప్పుడు. సరేసరి నోమంచి గుడ్డముక్కకి కూడా నోచుకోలేదు నువ్వు నన్ను కట్టుకున్నాక."

"అలా అనకండి. మీరేం తక్కువచేశారు నాకు? అబ్బాయి అందుకుంటే మనకేం

కాదవ? మీ ధోరణేమిటో విపరీతంగా ఉంది ఇవాళ."

భార్య అలా అనగానే రామారావు గుండెలు మరింత బరువెక్కాయి. అతని మనసు మళ్లీ మొదటికి వచ్చింది. నెమ్మదిగా తన బాధని వెళ్లబోసుకున్నాడు.

"ఇప్పుడేనా చెప్పుకాంతం. నేను ఒకవేళ కళ్లు మూసుకున్నాననుకో. అహ....అనుకో మంటున్నాను. అప్పుడు.....అప్పుడు నన్ను నేలవ పడేయరుకదూ? ఒక్కరోజేనా ఇంట్లో ఉంచుతారా నన్ను? అప్పుడు మీరంతా మనస్ఫూర్తిగానే ఏడుస్తారా నాకోసం? లేక అదంతా నలుగురి......"

ఇప్పుడు కూడా రామారావు మాట పూర్తి కాలేదు. అతని అంతర్యంలో మరిగే లావా బయటికి పూర్తిగా ఉబకనేలేదు!

పిడుగు పడినంత భయంగా గట్టిగా అరిచింది కాంతమ్మ. రామారావు గుండెల్లో కాంతమ్మ కళ్లు జడివాన కురిశాయి ఆర్తి.

తెలతెలవారుతుండగా తెలివివచ్చిన రామారావు తేలికపడిన మనసుతో కిటికీలోంచి నీలాకాశాన్ని చూశాడు. చిత్రం! ఆకాశంలో ఒక మబ్బు తునక కూడాలేదు. స్వచ్ఛంగా నిర్మలంగా ఉంది. తన మనసులాగే.

తను అనవసరంగా భయపడ్డాడు. కాంతం అన్నట్టు ఒకరివెంట ఒకరు చచ్చిపోవాలని ఎక్కడాలేదు. జోగయ్యకంతే ఆయువు వుంది కాబోలు. అంతా మిథ్య. ఎవరికి ఎవరూ ఏమీకారు అన్నది కూడా మిథ్యే! తన పిచ్చిగాని, తన భార్యా పిల్లలూ తన కేమీ కాకపోవటమేమిటి? వాళ్లకి తన మీద అభిమానం లేదనుకోవడం తన వెర్రి! అంతే.

ప్రాణానికి ప్రాణమైన మిత్రుడు విడిచిపోయాడనే బాధతో కృశించి ఎండిపోయిన రామారావు హృదయక్షేత్రం భార్య కన్నీటితో తడిసి ఉపశమనం పొంది తనకి 'నా' అనే వాళ్లింకా ఉన్నారన్న ఆశ మొలకెత్తింది.

తన వూహల్ని అబద్ధం అనిపించిన భార్య అక్కడ లేకపోవడంతో వెదుక్కొంటూ వంటగదిలోకి నడిచేడు రామారావు. ●

# వారఫలం

## 1-4-1966 శుక్రవారం మొదలు 7-4-1966 గురువారం వరకు.

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు సంతృప్తికరంగా నెరవేరతాయి. వృత్తిలో పోటీ వారిలో పోటీ పెరిగినా, దానివల్ల మీకు నష్టం ఏమీ ఉండదు. వ్యాపారం భారీయెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి రాగల సూచనలు ఉన్నాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంత వరకు లాభించగలవు. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రాగలవు. ఉద్యోగంలో మీ అభివృద్ధికి తోడ్పడే వార్తలను వింటారు. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో శ్రమమీద అనుకూలత లభించవచ్చును. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయడం తగదు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు ఏవో ఆటంకాలు వచ్చేటట్లు కన్పిస్తాయి కాని మీరు చాకచక్యంతో వ్యవహరించడం వలన వాటిని అధిగమించి వారాంతానికి తగినంత అభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో చాలా శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. అవసరానికి ఏదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. సాంఘిక కార్యక్రమాల్లో మెప్పుకురాని బాధ్యతను వహిస్తారు. కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉన్నా అప్పుడప్పుడు బలహీనత కన్పిస్తుంది. బంధువుల వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది.

**మిధునం:** ఈవారం మీ కార్యక్రమాల్లో ఆదాయం కంటె అడావుడి అధికంగా ఉంటుంది. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మెచ్చుకొని మీ ద్వారా తమ పనులను నెరవేర్చుకొనడానికి ప్రయత్నిస్తారు. వ్యాపారంలో మీరు యిదివరకు కొన్ని వ్యవహారాలను నిర్లక్ష్యం చేయడంవలన యిప్పుడు మీరు పొందవలసినంత లాభాన్ని పొందలేక పోవచ్చును. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరగడం వలన తీరిక లభించదు! బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కర్కాటకం :** అన్ని వ్యవహారాలూ అనుకూలంగానే ఉన్నట్లు కన్పిస్తాయిగాని, మీరు ఏమాత్రం ఏమరుపాటుగా ఉన్నా, వ్యయ ప్రయాసలకు గురి కావలసి వస్తుంది. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆర్థికంగా మీ స్వంత వ్యవహారాలు బాగానే ఉన్నా, ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. ఉద్యోగంలో ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు వచ్చి సర్దుకొంటాయి. బంధువుల వ్యవహారాల్లో మీరు శ్రమపడి కృషిచేసినా మాట దక్కక పోవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం యిదివరకటికంటె బాగా ఉంటుంది. శుభ కార్యాలంగా వ్యయం జరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :** ఏ వ్యవహారంలోను విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. వృత్తిలో పోటీ వారితో పోటీ పెరగడంవలన తరచుగా మీ కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. వ్యాపారంలో కొన్ని అవకాశాలు ఇంద్రధనుస్సువలె ఆకర్షణీయంగా కన్పిస్తాయి గాని, వాటిని గురించి ప్రయత్నించడంవలన ప్రయాసకు గురి కాగలరు. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాల్లో ఇదివరకు ఏర్పడిన అవరోధాలు చాలావరకు తొలగిపోతాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలయెత్తవచ్చును. అనారోగ్య సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు సామాన్యంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు రావడంవలన తరువాత కొంచెం బాగా ఉన్నా కూడా యీవారం సంతృప్తికరంగా ఉండదు. హోరాహోరీగా పోరాడి లాభంలేదని నిరాశ చెందిన తరువాత గాని ఏవనీ సానుకూల పడదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. ఉద్యోగంలో మీతాలూకు వస్తువులు పోయే సూచనలు ఉన్నాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరగడం వలన మీరే వెనుకకు తగ్గవలసి వస్తుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది. అనుకూలమైన వార్తలను వింటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు. పుణ్యకార్యాలు చేస్తారు.

**తుల :** గ్రహబలం అనుకూలంగా ఉంది. వ్యాపారంలో మీరు యిదివరకు ప్రయత్నించి అసాధ్యం అనుకొన్న వ్యవహారాలు కూడా యిప్పుడు సానుకూల పడగలవు. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారములు కూడా లాభించగలవు మీరు యిదివరకు జరిపిన ఆర్థిక వ్యవహారాలవల్ల యిప్పుడు యిబ్బంది కలుగవచ్చు. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయడానికి అవకాశం లభిస్తుంది. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలకు బంధువుల సహకారం కూడా లభిస్తుంది. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. పోటీవారితో మాటపట్టింపులకు దిగడం మంచిదికాదు.

**వృశ్చికం :** ఇతరుల దృష్టిలో యీవారం మీకు యోగవంతమైనదే కాని, మీకు మాత్రం సంతృప్తికరంగా కన్పించదు. వృత్తి వ్యాపారాల్లో ఆదాయ వ్యయాలు రెండూ పెరుగుతాయి. మీకు సంబంధించని వ్యవహారాల్లో చిక్కుకొని పోవడం వలన, మీ స్వంత పనుల్లో తగినంత శ్రద్ధ చూపించడానికి అవకాశం లభించదు. వారాంతంలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీకు ముందు ఉపయోగించగల వ్యక్తులను కలుసుకొంటారు. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

**ధనుస్సు:** వృత్తి వ్యాపారాల్లో మీరు ఘన విజయాల్ని ఏమీ సాధించలేకపోయినా అన్ని వ్యవహారాలూ అనుకొన్నట్లుగా జరగడంవలన, యీ వారం సంతృప్తికరంగా ఉంటుంది. భారీయెత్తున చేసే వ్యాపారాల్లో కొన్ని అవకాశాలు లాభదాయకంగా కన్పిస్తాయి గాని, వాటిని గురించి ప్రయత్నించడం వలన ప్రయోజనం కంటె ప్రయాస అధికంగా ఉంటుంది. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. స్థిరాస్తి వ్యవహారాలు మాత్రం అనుకూలంగా ఉండకపోవచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మకరం :** ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వారం ప్రారంభంలో సామాన్యమైన వ్యవహారాలకు కూడా, వ్యయప్రయాసలకు గురి కావలసి వస్తుంది. వ్యాపారంలో కార్యసాధన కోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా వ్యవహరించవలసి వస్తుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను అనుకూల పరిస్థితులు ఏర్పడుతాయి. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం :** ప్రయత్నించిన ప్రతిపని సులువుగానే నెరవేరుతుంది. గాని, ఫలితం మాత్రం సంతృప్తికరంగా ఉండదు. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. వృత్తిలో పోటీవారితో పోటీ పెరగడం వలన మీ కార్యక్రమాలను మార్చుకో

కలిసి వస్తుంది. ఉద్యోగంలో విడుటిపోరిదే తప్పు అయినా, మీరే సర్దుకొని పోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. బంధువుల వ్యవహారాల్లో చికాకులు ఏర్పడడంవలన ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వచ్చి సర్దుకొంటాయి. సాటి వారిలో గౌరవం బాగా ఉంటుంది.

**మీనం :** పూర్తిగా నెరవేరేవరకూ యే వ్యవహారాన్నీ నమ్మడానికి అవకాశంలేదు. మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా, కొన్ని వ్యవహారాలు అదుపు తప్పి మీరు ఊహించని పరిణామాలకు గురికాగల సూచనలు ఉన్నాయి. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదిలివేయడం మంచిది. వృత్తిలో మీ మంచితనాన్ని తమ స్వార్థానికి వినియోగించుకొన డానికి కొంతమంది వ్యక్తులు ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. స్థిరాస్తి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

—మహేష్ ●

సీరియల్ :




## 2

ఆ తరువాత రెండు మూడురోజులకే ప్రకాశం దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. పెళ్ళయిన మొదటి సంవత్సరం కనక ఆషాఢ మాసం వచ్చేలోగా రెండు రోజులలోవచ్చి రాధని తీసుకు వెడతానని వ్రాశాడు.

రెండోనాడు ప్రకాశం వచ్చేసరికి రాధ పెరటి వసారా అలుకుతోంది మట్టిపేడ పెట్టి. వాళ్ళింట్లో గదులు, వరండా అన్నీ కూడ మట్టే. ఈ మట్టినేల, అలుకో్వ వడం తెలియకపోవడంతో ప్రకాశం రాధని చూస్తూనే ఆశ్చర్యపోయి,

"రాధకి అన్నిపన్లు చేతనయినాయే !" అన్నాడు తృప్తిగా నవ్వుతూ.

"ఆ సంబడం! ఈ బిందె చూడు. ఎంత లొత్తపోయిందో. దీని తాతల్నాంటి బిందె లతో నీళ్ళు తెచ్చేవాళ్ళం నేనూ నా పెద్ద కోడలూను. ఈ చిక్కి బిందే మొయ్య లేక క్రిందపడేసింది నీ చెల్లెలు సుకుమారి. అసలు నేనే అలుక్కుంటున్నా వసారా పొద్దున్నే. నువ్వొచ్చేసరికి అనేదో పనిచేసి అలిసిపోతున్నట్టు కనిపించాలనుకుందేమో. నా చేతిలో పని లాక్కుంది ఇప్పుడే" అని దుర్గాంబగారు గయ్యిమని చెప్పేస్తూంటే రాధ నోటమాట రాక అలాగే ఉండిపోయింది.

ప్రకాశం మరేం మాట్లాడకుండా తల వొంచుకుని వెళ్ళిపోయాడు. రాధ సిగ్గుతో కుంచించుకుపోయింది.

పదకొండు గంటలవేళ మగవాళ్ళందరికీ కంచాలుపెట్టి, మంచినీళ్ళు అవి అమర్చింది రాధ. దుర్గాంబగారు వడ్డిస్తోంది. ఇంకా వివరూవచ్చి పీటలమీద కూర్చోలేదు. రోజూ లాగే నేతి గిన్నె పట్టుకుని నిలచుంది రాధ. ఇంతలో ఆవిడ కేం తోచిందో, పెద్ద కోడల్ని పిలిచి రాధ చేతిలోనేతి గిన్నె తీసుకో మంది. రాధ అయోమయంగాచూస్తూంటే, "పొద్దున్నే మా అన్నయ్య అన్నాడుగా, ఇక్కడేదో పని చేసి కష్టపడిపోతున్నావని. నువ్వెళ్ళి కాస్సేపు పడుకో" అంది రుసరుస లాడుతూ.

కళ్ళల్లో సుళ్ళు తిరుగుతున్న నీళ్ళు క్రిందికి జారకుండా అతి ప్రయత్నంమీద ఆపుకుంటూ పెరట్లోకి వెళ్ళిపోయింది రాధ.

భోజనం చేస్తూ ప్రకాశం అన్నాడు. "రేపు మళ్ళీ మంచిది కాదుట. సాయంత్రం బస్సుకే రాధని తీసుకు వెడతా."

దుర్గాంబగారు వగ్గైరాలు ఏమీ అభ్యంతరం చెప్పలేదు.

ఆ మధ్యాహ్నం గదిలో కూర్చుని బట్టలు సర్దుకుంటోంది రాధ.

"పుట్టింటికి ప్రయాణం అనేసరికి అమ్మాయిగారిపని బలే హుషారుగావుందే" అంటూ నవ్వుతూ వెళ్ళి మంచంమీద కూర్చున్నాడు భాస్కరం.

"పోనీ వుండి పోతాలెండి." అంది రాధ.

"అబ్బ. ఈ ఆషాఢమాసం అడ్డుగా! అమ్మావాళ్ళు ఎలాగా పంపించేస్తారనా అంత ధైర్యంగా చెప్తున్నావు" అన్నాడు. సంభాషణ చాల సరసంగానే జరుగుతోంది.

"నాక్కి పల్లెటూరిలో ఏం తోచదు. అందుకే ఎక్కువరోజులు బస్తీలో గడుపుతా. హో రేడియో అయినావుంటే కొంత కాలక్షేపం అవుతుం దిక్కడ. నువ్వొచ్చే టప్పుడో రేడియో తెచ్చుకోరాదూ. నీకూ కాస్త కాలక్షేపంగా ఉంటుంది. ఇంక నే నెటూ ఉద్యోగ ప్రయత్నంకోసం తరుచు పట్నం వెళ్ళవలసిన వాడనే" అన్నాడు తన మనస్సులో కోరిక కొంచెం కొంచెం బయట పెడుతూ. "చూస్తాను"అంది రాధ తలొంచు కుని.

తను రేడియో ఎలా కొనగలదు? మళ్ళీ అన్నయ్య డబ్బు ఎక్కడనుండి తెస్తాడు. అనే ఆలోచిస్తోంది.

"చూడ్డం ఏమిటి నీ మొఖం. అది అల్లుడి హక్కు. పెళ్ళయిన మొదటి ఏడాది అల్లుడికి ఆషాఢ పట్టేయిస్తారు. 'మా ఆయన రేడియో కావాలన్నారని' చెప్పు. నాక్కావలసింది రేడియో. మీరింకేదో యిస్తానన్నా నేను తీసుకోను. ప్రతి ఏడూ అడుగుతానా? ఏదో మద్యు ముచ్చట జరిపించుకోవలసిన సమయంలోనయినా అడగకపోతే ఎలా" అన్నాడు.

"రేడియోఅంటే ఏ మూడొందలో అవు తుంది." అంది భయం భయంగా.

"మూడొందలుపెట్టి బొక్కిరేడియో నా కక్కర్లేదు. నే నో మంచి మోడలు సెలక్టు చేసుకున్నా. దాని ధర నాలుగు వందల యాభై. అలాంటిదే కావాలి" అన్నాడు. అతనికంఠంలో తెచ్చిపెట్టుకున్న ఆప్యాయతపోయి సహజమయిన కర్కశత్వం స్థావర మేర్పరచుకుంది.

రాధకి అప్పటికే భయంతో నాలుక తడారిపోయింది. ఒళ్ళంతా చిరు చెమటలు పోస్తున్నాయి.

"అంత డబ్బు అన్నయ్య దగ్గరుంటుందో లేదో. అతన్ని ఇబ్బంది పెట్టడం బాగుంటుందా" అంది ప్రాధేయపడుతున్నట్టు.

"అన్నయ్య దగ్గర లేకపోతె మీ అమ్మ నడుగు. ఆ డబ్బు, పొలం కూడా పట్టుకు పోతుందా ఏమిటి? మనకి పెట్టకపోతే. నువ్వెవరికి చెప్పుకుంటావో నా కనవసరం. నాకు రేడియోతెప్పించి ఇచ్చే బాధ్యత నీది." అంటూ తలుపు తీసుకుని వెళ్ళిపోయాడు.

వివాహం అన్నా దాంపత్య జీవితం అన్నా ప్రతీ కన్యలాగే బంగారు కలలుకంటూ, ఆ యింట్లో అడుగుపెట్టిన రాధ తన కల లన్నీ కల్లలని, ఆ యింట్లో ఎవరికీ మానవత్వం అనేది లేకపోగా కనీసం కట్టుకున్న

భర్తయినా ఒక మనిషిగా ప్రవర్తించి తన నొక మనిషిగా గుర్తించే అవకాశంలేదని గ్రహించుకుంది. ఎప్పటికయినా మంచిరోజు లనేవి రాకపోతాయా, తను సుఖంగా కాలం గడపలేకపోతుందా అనే ఆశ ఆమెకి మిగిలి పోయింది.

ఆ సాయంత్రమే అన్నగారితో కలిసి పుట్టింటికి వచ్చింది. వారం రోజుల తరవాత నో సాయంకాలం శాంతమ్మగారు, ప్రకాశం కూర్చుని అల్లుడికి పంపవలసిన ఆషాడపట్టీని గురించి మాట్లాడుకుంటున్నారు. నూరు రూపాయలలో వస్తువేదైనా ఇవ్వాలని వాళ్ళ ఉద్దేశ్యం. ఏం కొనాలో నిశ్చయం చేసుకో లేక ఆభారం ప్రకాశం రాధమీదే పెట్టాడు

"పోనీ నో నూరు రూపాయలు మని యార్డరు చేసేయమంటా వేమిటమ్మా?" అన్నాడు చెల్లెలితో.

"నాకేం తెలుస్తుం దన్నయ్యా. నీ ఇష్టం" అంది లేని నవ్వు తెచ్చుకుంటూ

కూతురు మొఖంలో ఏం భావాలు చది విందో, "నేను తరువాత కనుక్కుంటాలే. ఇప్పు డంత అర్జంటుగా నిర్ణయించుకునే దేముంది" అంది శాంతమ్మగారు నెమ్మదిగా

ప్రకాశం వెళ్ళిపోయాక, రాధ తల నిమురుతూ.

"అత నేమైనా కావాలని నీతో చెప్పా డేమిటమ్మా" అంది.

తల్లి లాలనలోని చల్లదనానికే రాధ కళ్ళు రెండూ వర్షించేశాయి. తల్లి చూడ కుండా ఉండాలని తల వంచేసుకుంటూంటే ఆవిడే కూతురు గడ్డం పట్టి మొఖం తనవైపుకి తిప్పుకుని, చెంపలమీద జల జల రాలుతున్న కన్నీటిని తన కొంగులో తుడిచి,

"ఛ తప్పమ్మా. కొత్త కాపరం చిలకా గోరింకల్లా ఉండాల్సిన రోజుల్లో, ఈ కన్నీ ళ్ళేమిటి తల్లి ఏం జరిగిందో చెప్పు. ఆడ పిల్లలు మనసు విప్పి తల్లి దగ్గర కాక పోతే ఇంకెవరితో చెప్పుకుంటారమ్మా. చెప్పు" అంటూ బుజ్జగించింది.

"ఆయనకి రేడియో కావాలిటమ్మా." అంది తలొంచుకునే.

"ఎంతవుతుందో. ఇప్పుడు డబ్బేదమ్మా? మొన్న పెళ్ళికే నాలుగైదు వేలదాకా పోయింది తెలుసా. ఇక్కడా అక్కడా తెవలసి వచ్చింది. ఏదో నా పొలం ఉంది కదా ఆ పంటమీద తీర్చు కోవచ్చునని, ఆ పెళ్ళి సమయంలో వాళ్ళ కేమీ కోపాలు రాకుండా అడిగినవన్నీ బాగానే జరిపాం. నీకు మాత్రం తెలియం దేముంది. పోనీ సంక్రాంతి పండగనాటికి నెమ్మదిగా కొనిస్తామని చెప్పు. ఇప్పటి మట్టుకి నో వంద రూపాయలు పంపుదాం" అంది.

"కాదమ్మా. ఏదో క్రొత్త మోడలు రేడియో వచ్చిందిట. దాని ఖరీదు నాలుగు



వందల యాభైట. అదే కావాలన్నారు ఈ ఆషాడ మాసంలోనే అది కొనిపించి యిచ్చే బాధ్యత నాదేట. ఇవ్వకపోతే వారికి కోపం వస్తుందమ్మా." అంటూ తల్లి ఒడిలో తల పెట్టుకుని బావురుమంది రాధ.

"ఛ తప్పు, ఏడవకు. అన్నయ్యతోనే చెప్తాలే. అతను గట్టిగా అదే కావా లంటే అలాగే యిద్దాంలే. అతను మాత్రం అస్తమానూ అడుగుతా డేమిటి ? మొదటి సంవత్సరం మనం ఇవ్వడం అతను పుచ్చు కోడం ఆచారం ఉంది కనుక అడిగాడు లే, కళ్ళు తుడుచుకో." అని కూతురి కళ్ళు తుడిచి వంటపనిలో జొరబడి

రాధ మొఖం కడుక్కొని బొట్టు పెట్టు కొచ్చి,

"పార్వతిని చూసొస్తానమ్మా. ఈ వారం రోజులయినా దాని సంగతే జ్ఞాపకం రాలేదు. అదీ వచ్చి ఉండాలిగా మరి." అంది.

"పార్వతి రాలేదమ్మా. హైదరాబాదులో కాలేజీలో చేరి చదువుకుంటోందిట. అయినా వాళ్ళ అత్తగారు అక్కడ లేదుగా. ఇంక ఆషాఢమాసం పట్టించేదేముంది ?" అంది శాంతమ్మగారు కుంపటి విసురుతూ.

రాత్రి భోజనా లయినాక హాల్లో నడుం వాల్చి కుని ఖబుర్లు చెప్పుకుంటున్నప్పుడు శాంతమ్మగారు రేడియో సంగతి ఎత్తింది.

"వాళ్ళు అదో రకం మనుషులమ్మా. పంతాలు, పట్టుదలలు ఎక్కువ. ఆ ఇంట్లో, ఒక్క పూట కూడ ఉండలేకపోయాను. రాధ యిక్కడుండగా తను ఎంగిలి కంచం అయినా తీసుకుని ఎరగదు. అలాంటిది అక్కడ బండెడు వంచాలు ముందేసుకుని తోముతోంటే చూడలేకపోయాననుకో. పైగా వెధవ ఎట్టికొంప. నే వెళ్ళేసరికి రాధ ఇల్లంతా అలుకుతోంది. ఎక్కడో ఉన్న కాలవకెళ్ళి నీళ్ళన్నీ తెచ్చి పోసింది.

వింతయినా ఏమిటో మన పద్ధతులకి వాళ్ళ పద్ధతులకి చాల తేడా ఉంది." అన్నాడు ప్రకాశం చికాగ్గా.

"బాగుందిరా. ఎల్లకాలం ఆ పల్లెటూరిలో పడుంటుందా ఏమిటి ? రేపతనికి ఉద్యోగం అయితే ఏ బస్తీకో వెళ్ళిపోతారు. దానికేంగాని, ముందీ రేడియో సంగతి కనుక్కో. ఏదో అతనికి నచ్చిందీ కావలసినదీ ఇస్తే నయం కదూ."

"నా చేతిలో ఒక్క కానీకూడ లేదమ్మా! ఏడెనిమిది నెలల నుండి కామాక్షికి ఎన్ని మందులు ఇంజక్షన్లు వాడవలసి వచ్చిందో చూస్తూనే ఉన్నావుగా. అక్కడున్నన్నాళ్ళ మందులకి వాళ్ళ నడిగితే బాగుండదని వెళ్ళేటప్పుడు ఇంకో వంద రూపాయలు చేతిలో పెట్టి పంపించాను. ఇంక ఇప్పుడు అంత డబ్బెక్కడనుండి తేగలను." అంటూ ప్రకాశం తన నిస్సహాయతని వెల్లడించేశాడు. అతని భార్య ఆ క్రిందటి నెలలోనే పురిటికి పుట్టింటికి వెళ్ళింది.

ఇంకా వాళ్ళు తనని గురించి డబ్బు కోసం తర్జన భర్జనలు పడుతూంటే "నా దగ్గర రెండు వంద లున్నాయమ్మా పెళ్ళిలో వచ్చినవి. రెండువందల ఇంకో యాభై ఎక్కడైనా దొరికితే బాగుండును" అంది రాధ.

"వరేలే. మూర్తయ్యనే అడుగుదాం. మనకి పంట ధాన్యం ఇచ్చినప్పుడు అందులో

# నిరీక్షణ

తగ్గించుకుంటాడు." అంటూ సమస్య తేలిపోయినట్లు ప్రక్కకి తిరిగి పడుకుంది శాంతమ్మగారు.

ఆ తరువాత రెండు రోజులకే ప్రకాశం వాళ్ళకి డబ్బు పంపించాడు రేడియో కొనుక్కోమని.

పో నెల్లాళ్ళు ఉండి రాధ అత్తవారింటికి వెళ్ళిపోయింది. గదిలో బల్లమీద రేడియో ఉంది ముచ్చటగా. ఆ సాయంత్రం ఏవో రికార్డులు వింటూ రాధ గదిలో ఉండగా భాస్కరం లోపలి కొచ్చాడు.

"చూశావా. రేడియోతో నీ కొంత కాలక్షేపమౌను. నాది పేరేగాని అసలు అది నీ క్కావాలనే కొనిపించుకునుంటావు." అన్నాడు నవ్వుతూ రాధ కళ్ళల్లోకి చూస్తూ.

రాధ మొఖం పక్కకు తిప్పుకుంది. అతనింకా ఏదో చెప్పబోయాడు. ఇంతలోనే కంచుగంటలా దుర్గాంబగారి కంఠం మ్రోగింది.

"అయ్యో. అయ్యో. ఎంత సిగ్గులేనితనమో. పట్టపగలు గదిలో దూరి ఏమిటా సరసాలు. ఇన్నాళ్ళనుండి కాపరాలు చేస్తున్నాము కాని ఎప్పుడూ ఎరగమమ్మా ఈ విడ్డూరం. అవును మరి. బస్తీ పిల్ల, చదువుకున్న పిల్ల మాలా ఎలా ఉంటుంది? అందులో ఆ రేడియో ఒకటి కొనిచ్చాడుగా అన్నగారు. ఇంక ఇల్లూ సంసారం

అక్కర్లేదు. ఇరవైనాలుగ్గంటలు దాంతో కాలక్షేపం చేయొచ్చు"

రాధ రేడియో ఆపేసి ఇవతలికి వచ్చేసినా ఆవిడ దండకం సాగిస్తూనే ఉంది. ఆ రోజంతా రాధతో మాట్లాడలేదు. ఇంక ఆనాటినుండి మళ్ళీ ఎప్పుడూ రేడియో ముట్టుకోలేదు రాధ.

అంతకుముందు చేసిన ఉద్యోగ ప్రయత్నాలు ఫలించలేదనేమో, ఉన్నట్టుండి పోరోజు మళ్ళీ బస్తీకి ప్రయాణం అయాడు భాస్కరం. వెడుతూ వెడుతూ "డబ్బేమైనా ఉంటే యియ్యి." అన్నాడు భార్యతో.

"నాదగ్గరేం లేదు" అంది రాధ నెమ్మదిగా.

"ఏడుపుముఖం పెట్టుకుని ఉత్త చేతులతో తయారయావా? నాకే సంపాదన లేక చస్తూంటే నీ ఖర్చులన్నీ ఎవడు పెడతాడనుకుంది మీ అమ్మ. తిండంటే మానాన్న పెడతాడు గాని పై ఖర్చులకైనా మీ అమ్మ ఇవ్వకపోతే ఎలా? ఉద్యోగం అయిందాకా పెళ్ళి చేసుకోనమ్మా అంటే వినకుండా నా మెడకో గుదిబండని తగిల్చారు. నాన్నగారి నెంత డబ్బని అడుగుతాను" అంటూ భార్యమీద విరుచుకు పడ్డాడు.

"ఏమడిగినా మీ కోసమే కాని నా కోసం కాదుగా. నాకొక్క తిండి ఖర్చు తప్ప ఇంకేముంది ? అదేదో ఇంట్లోనే జరిగిపోతోంది." అంది, ఎంత నిగ్రహించుకుందామన్నా పొంగి వచ్చే పౌరుషం, అభిమానం ఆపుకోలేక.

"పోర్నుయ్. సమాధానాలు మాత్రం బాగా వచ్చు. పెళ్ళి చేసుకోకుండా లా చదివుంటే బాగా సంపాదించగలిగేదానివి. మీ బస్తీ వేషా లిక్కడ పనికిరావు. నోరెత్తకుండా అణిగి మణిగి ఉండగలిగితేనే ఈ ఇంట్లో ఉండు. లేకపోతే ...." ఆ వాక్యం పూర్తి చెయ్యకుండానే తలుపు తీసుకుని వెళ్ళిపోయాడు.

"లేకపోతే ? ఏమిటి చేస్తారు ? పుట్టింటికి పంపించేస్తారా ? తన అవసరాలకి డబ్బు అందివ్వలేని నేనంటే ఆయన కెంత చులకన ? తనకి ఉద్యోగం లేకపోతే మాత్రం



కట్టుకున్నందుకు భార్యని అభిమానించడానికి, ఆదరించడానికి అభ్యంతరం ఏమిటి ? ఆదరించడానికి, అభిమానించడానికి అసలు భార్య కావాలని ఆయన ననుకుంటేగా. తమ కొడుకు బాగుపడి జీవితంలో స్థిరపడాలనే స్వార్థంతో, ఆ ప్రయోజన సాధనకు నన్నో ఇంధనంగా ఉపయోగించ దలిచారు మా అత్తగారు మామగారు. ఈ పెళ్ళివల్ల కొంత డబ్బు వచ్చే మార్గం అయినా దొరుకుతుందనే ఉద్దేశ్యంతో వారూ అందు కంగీకరించారు. అందుకే అడిగినప్పుడల్లా డబ్బు అందివ్వలేని నేనంటే ఆయన కంత అలుసు.'' అనుకుంటూ లోలోపలే కుమిలిపోయింది రాధ.

రోజులలాగే గడిచిపోతున్నాయి. సంక్రాంతి పండగ దగ్గిరకి వచ్చింది. వోరోజు ప్రకాశం వచ్చాడు వాళ్ళని తీసుకెళ్ళడానికి. అంతకు ముందు దసరాకీ, దీపావళికీ భాస్కరం వెళ్ళలేదు, రాధని పంపలేదు ఇంక సంక్రాంతికైనా తప్పకుండా రావాలని ప్రకాశం మరీ మరీ బ్రతిమాలుతూ వ్రాస్తే అంగీకరించాడు.

పెళ్ళయింతరువాత మొదటిసారి పండగకి తీసుకెళ్ళడం కదా. అందుకని అత్తగారిని, మామగారిని అందర్నీ ప్రయాణం అవమని వ్రాశాడు ప్రకాశం. అత్తవారిళ్ళల్లో నుంటున్న ఆడబడుచులు కూడ వాళ్ళ పిల్లలతో వచ్చారు ఆ రోజుకి. పెద్ద చిన్న కలిపి వో పాతికమంది పెళ్ళివారిలా బయలు దేరారు.

వో పది రిక్షాలలో దిగుతున్న వీళ్ళందర్నీ చూసి వీధిగుమ్మంలో నుండే మూతి ముడుచుకు వెళ్ళిపోయింది కామాక్షి. శాంతమ్మగారు కూడ ఆశ్చర్యపోయినా అందర్నీ మర్యాదగా లోపలికి తీసుకు వెళ్ళింది.

వాళ్ళకి కాఫీలు, ఫలహారాలు, పిండి వంటలుతో భోజనాలు. వీటితో ఎంతో హడావిడి పడిపోయింది శాంతమ్మగారు. తనకి శక్తిలేకపోయినా, చంటి పిల్లవాడితో కోడలు యిబ్బంది పడుతుందనీ, పైగా ఇంతమందికీ చెయ్యమంటే ఏమైనా అనుకుంటుందనీ ఆమెకే పని చెప్పకుండా తనొక్కతే హైరాన పడుతూనే పనులన్నీ చేసుకుంది.

పండగనాడు ఎంటిపిల్లా దగ్గరనుండీ, వచ్చినవాళ్ళందరికీ బట్టలు తెచ్చాడు ప్రకాశం. నలుగురితోబాటు భాస్కరాని క్కూడ సామాన్యమైన బట్టలే తెచ్చాడు. అప్పటికే మూడు వందలు దాకా అయింది బట్టలకి. తెలిసిన షాపు కాబట్టి అరువు దొరికింది.

మొదట తీసుకున్నట్లే తీసుకుని తరువాత రాధని గదిలోకి పిలిచి ఆమె మొఖాన్ని వేసి కొట్టాడా బట్టలు భాస్కరం.

''నేనేం గతిలేక వచ్చాననుకున్నారా? కొత్తల్లుడిని. మొదటిసారి పండగకి తీసుకొచ్చి ఈ ముష్టి గుడ్డలా పెడతాడు మీ అన్నయ్య. అంత ఇచ్చుకోలేనప్పుడు అసలు మమ్మల్ని ప్రయాణం చెయ్యడం ఎందుకు ? నన్ను నలుగురిలో చిన్నబుచ్చ డానికా. పెళ్ళయింతరువాత నేనేనా డయినా మీ గడప తొక్కానా ? అన్ని సార్లు పిలుస్తున్నారు బాగుండదని వచ్చినందుకు ఇదా మర్యాద ?'' అంటూ చెల రేగిపోయాడు.

రాధ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ''మీరు గొడవ చెయ్యకండి. నేను అమ్మకి చెప్పి ఇంకేదైనా తెప్పిస్తాను. నలుగురితో బాటు ఇప్పటికి బట్టలు కట్టుకోండి.'' అంటూ ప్రాధేయపడింది.

''నలుగురితోపాటూ నాకూ యిచ్చారంటే మా అక్కయ్యలు యిప్పుడే వెక్కిరిస్తారు. నాకోసం ప్రత్యేకంగా ఏమిస్తున్నారో మీ అమ్మ నడిగిరా, అప్పుడు ఈ బట్టలు కట్టుకుంటా.'' అంటూ కుర్చీలో కూర్చున్నాడు సావకాశంగా.

రాధ వంటింటివేపు వెళ్ళింది తల్లి కోసం. పాపం ఆవిడింకా అంట్లగిన్నెలు సవరించుకుంటూ, ఎంగిళ్ళు ఎత్తుతూ అక్కడే ఉంది. కూతురి ముఖం చూస్తూనే ఏదో జరిగిందని పసిగట్టింది.

''బట్టలు వచ్చాయమ్మా మీ అత్త గారికి వాళ్ళకీను. మీ ఆయనేమంటున్నాడు.'' అంది రాధవంక పరీక్షగా చూస్తూ.

''అందరి సంగతి నాకు తెలియదమ్మా! ఆయన మాత్రం బట్టలు అతి సామాన్యంగా ఉన్నాయంటూ గునుస్తున్నారు. అయినా ఇప్పు డింతమందిని తీసుకొచ్చి ఇంత ఖర్చు నెత్తినేసుకోకపోతే, ఆయ న్నొక్కర్నే పిలిచి సంతృప్తిపరుస్తే తీరి పోయేదిగా. మధ్య నేను నలిగిపోతున్నాను.'' అంది వచ్చే దుఃఖా న్నాపుకుంటూ.

''మర్యాదకయినా పిలవకపోతే ఎలా గమ్మా. పిలిచినందు కేదో వచ్చారు మరి. పోనీ అన్నయ్యతో చెప్తా నుండు, అతన్ని బజారుకి తీసుకెళ్ళి కావలసినవి కొనిమ్మనమని. ముందయితే అరువు దొరుకుతుంది కదా. తరువా తెలాగో తీర్చుకుంటాం'' అంటూ ఆవిడ కొడుకుని పిలవడానికి వెళ్ళింది.

రాధ కేమిటో అన్నగారికి కనుపించా లంటేనే ముఖం చెల్లక గదిలోకి వెళ్ళి కూర్చుంది. అయిదు నిముషాల తరువాత ప్రకాశమే బావగారిని పిలుస్తూ గదిలోకి వచ్చాడు.

''బజారుకి వెళ్దాం పదండి. నూలు గుడ్డలు మీ కెలాటివి నచ్చుతాయో తెలియక అందరితోపాటే పంచల చాపు తెచ్చాను. మీకు నచ్చినవి మీరేర కుందురు గాని రండి.'' అంటూ వెంటబెట్టుకుని తీసుకెళ్ళాడు.

అప్పటికి వియ్యపురాలువాళ్ళు ఎవరూ కూడ కొత్త బట్టలు కట్టుకోలేదు. ''అదేమిటి వదినగారూ, ఇంకా అలాగే ఉన్నారు. ఏదో మా శక్తికి తగినట్టు తెచ్చాం. మీకు నచ్చాయో లేదో మరి. అయినా మీ రవి కట్టుకుంటే మాకు తృప్తిగా ఉంటుంది.'' అంది శాంతమ్మగారు.

''మా అందరి మాటకేంలెండి. కొత్తల్లుడు, వాడికైనా కాస్త మంచి బట్టలు తెచ్చారా.'' అంది పెద్దాడబడుచు దీర్ఘాలు తీసుకుంటూ.

''అతని క్కావలసినవి ఎంచుకోమని అబ్బాయి యిప్పుడే బజారుకి తీసు

తెస్తాడు. వాళ్లు ఏ పది నిముషాలలో వచ్చేస్తారు. ఈలోగా మీరంతా కట్టుకోండి" అంటూ ఆవిడ అందర్నీ బలవంత పెడితే అంతా కొత్తబట్టల్లో ముస్తాబయ్యారు.

ఇంతలో ప్రకాశం వాళ్లు రానే వచ్చారు. అతను చెల్లెల్ని చాటుకు పిలిచి "అతనికి నచ్చినవి ఊళ్లోనే లేవుటమ్మా. డబ్బిస్తే అతనే కొనుక్కుంటాడు. ఎంత ఇమ్మంటాడో అడుగు" అన్నాడు.

రాధ గదిలోకి వెళ్లేసరికి భర్త, అత్తగారూ ఆడబడుచులు, అంతా నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు. రాధని చూసి ఆడబడుచు,

"అదేమిటి రాధా! ప్రతిదీ నోరు తెరిచి అడుగుతేనే కాని తెలియదేమిటి మీవాళ్లకి. పండగకి సరదాగా ఏ సిల్కు సూటు కుట్టించాలని తెలియకపోయిందా. అయినా ఈ ఊళ్లో ఖరీదైన గుడ్డముక్కే దొరకదేమిటి. ఏ నూరు రూపాయ లిమ్మను. ఈసారి పట్నం వెళ్లినప్పుడు అక్కడ కొనుక్కుంటాడు....."

"అందాకా ఆ కొత్త పంచ కట్టేసుకోరా. పండగపూట అల్లుడు కొత్త బట్టలు కట్టుకోలేదంటే వాళ్లూ చిన్న బుచ్చుకుంటారు." అని మరదల్నీ తమ్ముడిని హెచ్చరించి వెళ్లిపోయింది.

# నిరీక్షణ

మళ్లీ నూరు రూపాయలు తేవడం ఎంత కష్టమో గ్రహించినా, సిగ్గు, అభిమానం అన్నీ విడిచి తల్లితో ఆ విషయం చెప్పింది రాధ.

పండగ వెళ్లిపోగానే వాళ్లంతా ప్రయాణము అవుతూంటే చెల్లెల్నింకో నెలరోజు లుంచుకుని పంపిస్తానని అడిగాడు ప్రకాశం. వాళ్లు అంగీకరించారు.

హడావిడంతా అయిపోయాక విశ్రాంతిగా పడుకుంది. శాంతమ్మగారు ఏ సాయంత్రము రాధ తల్లి పక్కలో జేరింది నెమ్మదిగా.

"నా పెళ్లయిం దగ్గరనుండి నీ కెంత అప్పు అయిందమ్మా" అంది ఉన్నట్లుండి.

ఆవిడ ఆప్యాయంగా కూతురు తల నిమురుతూ, "ఏదో మొదట్లో మనం పెట్టాలని వాళ్లు పుచ్చుకోవాలనీ ఉంటుం దమ్మా కొంతమందికి. క్రమంగా వాళ్లే మారతారు. డబ్బు మాటకేం. నీకేం కష్టంగా లేదు కదా తల్లి అక్కడ" అంది.

"కష్టం ఏముందమ్మా. ఏం లేదు. వారికేదో ఉద్యోగం దొరికితే వేరే వెళ్లిపోతాం. అప్పు డింత డబ్బు ఇబ్బందీ ఉండదు. నాకో ఇరవై రూపాయలు కావాలమ్మా. నేను కూడ ఏమిటో నీ ప్రాణాలు తీస్తున్నాను" అంది సిగ్గుతో సగం చచ్చి.

నిజానికి అంతక్రితంసారి వెళ్లినప్పుడు చీర సారె అన్నీ కాకుండా ఏ ఖర్చుకైనా ఉంటుందని, పది రూపాయలు ఆవిడ ఇయ్యబట్టే ఆ నాలుగైదు నెలలు రాధకి పై ఖర్చులన్నీ జరిగిపోయాయి. లేకపోతే ఏ పదిహేను రోజులకైనా తల్లికి ఉత్తరం వ్రాయడానికి కార్డు ముక్కకి కూడా ఎంత యిబ్బంది పడిపోయేదో.

"అలాగేనమ్మా. చీరలు కూడ కావలిస్తే ఇంకో రెండు తీసుకో. ఈమధ్య మీవాళ్లేమైనా కొన్నారా బట్టలు?" అంది.

"లేదమ్మా. అయినా పెళ్లికి ముందు నువ్వు కొన్నవే ఉన్నాయి."

"అదేమిటే! ఇన్ని పండగలు వచ్చాయి కదా. ఒక్క చీరైనా పెట్టలేదా." అంది ఆవిడ విస్తుపోతూ. రాధ సిగ్గుతో తల వంచుకుంది.

ఏ పదిహేను రోజులుండి రాధ అత్తవారింటికి ప్రయాణం అయింది. శాంతమ్మగారు కూతురికో నాలుగు చీరలు తెప్పించి యిచ్చి, ఏ పాతిక రూపాయలు కూడ చేతిలో పెట్టింది. తల్లికి యిబ్బంది కలుగుతుందని తెలిసి కూడ రాధ నిరాకరించలేక పోయింది. ఆ ఏడు పంటలు కూడ పాడయిపోయాయి. ఒక్క కాని చేతిలోకి రాలేదు. అప్పటిదాకా చేసిన అప్పు మాత్రం ఏ వెయ్యి రూపాయలు పైగా ఉంది.

ఇంకో నెల్లాళ్లుండమని తల్లి బలవంతం చేసింది కాని రాధకే ఎలాగో అనిపించింది. దానికి తోడు ఇంట్లో వాతావరణం కూడ మారుతోన్నట్లనిపించింది. ప్రకాశం మునుపటంత ఆప్యాయతగా ఉండడంలేదు. అందులోనూ రాధ అత్తవారి సంగతి ఎత్తుతేనే అతనికి ఏవగింపు కలుగుతోంది. నిజమే మరి! మర్యాద యిచ్చి మర్యాద పుచ్చుకోడం తెలియని మనుష్యులు. వాళ్ల కోసం రాధ బాధపడి లాభంలేదు.

అత్తగారు డబ్బంతా రాధకే పెట్టేస్తోందని, ఇంక మనకేమీ మిగలదనీ— ఏ క్రొత్త భావం కామాక్షిలో కలిగినట్లు రాధ పసిగట్టింది. అయినా ఏమీ చేయగలిగే స్థితిలో లేదు. కాని మనస్సంతా




"కూర్చోడానికి ఇది తెచ్చుకపోతే ఎలా? ... బస్సుకోసం నుంచొని నుంచొని కాళ్లు పీకుతాయి మరి!"

కలతబారిపోయింది. అలాగే ప్రయాణం అయి అత్తవారింటికి వెళ్ళిపోయింది.

వెళ్ళడం వెళ్ళడం ఒక సంవత్సరం దాకా మళ్ళీ పుట్టింటికి రాలేదు. అంటే మళ్ళీ సంక్రాంతికే వచ్చింది. అప్పటికి కూడ భాస్కరానికే ఉద్యోగం దొరకలేదు. అసలు అతను చేస్తున్న ప్రయత్నా లేమిటో రాధకి తెలియదు. వారంరోజు లింట్లో ఉంటే రెండు నెలలు బస్తీలో గడిపి వచ్చేవాడు. వెళ్ళి నప్పుడల్లా రాధని డబ్బు అడగడం తను లేదనడం, ఆమెని నాలుగు తిట్టి అతను వెళ్ళిపోవడం మామూలయిపోయింది. రాధ ఏదైనా దాచుకుని లేదంటోందని అను కునేవాడేమో, లేదని చెప్పినా ఆమాట నమ్మక మళ్ళీ మళ్ళీ అడుగుతూనే ఉండే వాడు.

"ఎప్పుడూ డబ్బు లేదంటావు. నీకు స్నోలు, పౌడర్లూ ఎక్కడ్నించి వస్తు న్నాయి." అని నిలదీశా డొకసారి.

"నేను స్నో, పౌడరు మానేసి చాల కాలమయింది. తలకి నూనె, ఒంటికి సబ్బు ఇవి ముఖ్యావసరాలు కదా. వాటి విషయం కూడ మీరు పట్టించుకోడం లేదు. అందుకే అమ్మ యిచ్చిన పది రూపాయలు మీ కివ్వకుండా దాచు కున్నాను" అంది.

"ఊహూ. పది రూపాయలు దాచిన దానివి ఎంత డబ్బయినా దాచగలవు. ఒక అబద్ధం ఆడిన దానివి ఎన్ని అబద్ధా లయినా ఆడగలవు. ఛీ, కట్టుకున్న మొగుడ్ని కూడ మోసంచేసే నువ్వూ ఒక ఆడదానివేనా" అంటూ చీత్కారం చేస్తూ గదిలో నుండి వెళ్ళిపోయాడు.

అతను వూళ్ళో ఉన్న వారం రోజులైనా సరదాగా ఉండేవాడు కాదు. ఎందుకో అందుకు చికాకుపడ్డం, కేకలెయ్యడం, ఆఖ రికి మధ్య మధ్య చెయ్యి చేసుకోవడం దాకా వచ్చింది. రాధ కెందుకో - అతను యింటికి రాకుండా టౌనులోనే ఉండిపోతే బావుండు ననిపించేది ఒక్కోసారి. కాని భర్త తన్ని నిర్లక్ష్యం చేస్తున్నా, అతనిలో ఎలా గైనా పరివర్తన తీసుకొచ్చి తన వాడిగా చేసుకోవలసిన బాధ్యత తనదేనని మధ్య మధ్య గుర్తు వస్తుండేది. ఆ వూళ్ళో ఉండి తనేమీ సాధించలేదు. అక్కడి వాతా వరణం అలాంటిది. కొడుకు సంగతి తెలి సుండీ కూడ, అతను వూరునుండి వచ్చే సరికి కోడలిమీద ఉన్నవీ లేనివీ బోలెడు కల్పించి చెప్తూండేది దుర్గాంబగారు. వాటిలో నిజానిజాలు కూడ ఆలోచించ కుండా భార్యని గొడ్డుని బాదినట్టు బాదే వాడు అతను. ఆవిడకి అదేం ఆనందమో మరి, అప్పటితో తృప్తిపడి వూరుకునేది.

(సశేషం)

వైజ్ఞానిక గాథాశతి-54.

....క్షమించండి సార్.........
నేనూ ఈ గోళానికి కొత్తేనండీ!



# ఖగోళాలలోని జీవము కథ

—డాక్టర్

జీవమూ ప్రాణులూ అన్నవి భూమి మీదేనా ఇతర ఖగోళాలలో ఎక్కడేనా ఉన్నాయా? అన్న ప్రశ్న చిరకాలమునాటిది. భారతీయులు "అనంతకోటి బ్రహ్మాండాలున్నాయి" అని రాసేశినా, 'నక్షత్రాలు అనంతకోటి ఉన్నా'యన్న బారు ప్రవచనము లాగే అదీ అవలోకనముమీద నాధారపడినదికాదు. వైజ్ఞానికులు భూమికాక తక్కిన ఖగోళాలలో జీవమున్నదా అని చేసిన జిజ్ఞాసలో వారికి మొదటి సాధనము దూరదర్శని. అంగారక గ్రహములో ధ్రువ మండలాల దగ్గరా చుట్టుపట్లా జాడల్లాగ గోచరించాయటా! అవి ఆ గ్రహవాసులు పండించే పంటలంటూ వైజ్ఞానికులు ఏవో కథలు అల్లేరు.

టెలిస్కోపు తరవాత గ్రహాల ఉపరితలము యొక్క ఉష్ణతాజ్ఞానము సాయపడింది. భూమిమీది ప్రాణులన్నీ $80^\circ$ ఫారెన్‌హీట్ నుంచి $115^\circ$ వరకూ ఉన్నాయనుకుంటే, ఈ ఉష్ణత ఎక్కడా ఉన్నట్టు కనబడలేదు. కనక భూమిమీదవున్న రకపు జీవములు ఇంకెక్కడా లేవనుకున్నారు.

రసాయన శాస్త్రజ్ఞులు జీవ పదార్థములో ఆక్సిజనూ హైడ్రోజనూ కర్బనమూ ఉంటున్నాయని గుర్తించారు. మనకు కనబడే నక్షత్రాలలో ఉష్ణోగ్రత చాలా హెచ్చుగా ఉండడముతో ఈ రకపు చేరికలు ఆ వాతావరణాలలో ఉండడానికి వీలే లేదన్నారు. ఒక్క భూమిమీదే ఉంటూన్న జీవముమీదా, మానవుడిమీదా విశ్వానికి మమతే లేదనీ, మానవుడు అదృశ్యమైపోయినా విశ్వానికి అతని ప్రమేయము ఏమిన్నీ లేనట్టే కానవస్తూన్నదనీ అనేశారు.

భూమికి చేరువగావున్న గ్రహముల పరిశీలనమాత్రము దాని దారినది సాగింది. జీవము అనగా ఏమిటో నిర్వచించడము కష్టమేగాని, అది 'పెద్ద పెద్ద అణువు' (Molecules)లలో జరిగే రాసాయనిక క్రియ అన్నారు కొందరు. కోడిగుడ్డు సొనయొక్క ఒక అణువులో 1428 కర్బన పరమాణువులూ, 2244 హైడ్రోజను పరమాణువులూ, 364 నత్రజని పరమాణువులూ, 462 ఆక్సిజను పరమాణువులూ, 14 గంధక పరమాణువులూ ఉన్నాయట. జీవము అనగానే కర్బన పరమాణువూ, దాని చుట్టూ పెరిగిపోయిన పరమాణు అల్లికలూ సిద్ధమవుతున్నాయి. ఇది జీవకణ నిర్మాణము సంగతి. ఇక జీవ ప్రవర్తనానికి కావలిసినది ఆక్సిజను. ఈ పరిస్థితులు ఇతర ఖగోళాలలో ఉన్నాయా అని ప్రశ్న.

కర్బనముతో ఏర్పడ్డ పెద్ద అణువులు అంగారకాణువులు (Organic Molecules)—ఇతర గ్రహాలలో ఉన్నాయా అని చూస్తే, అది ప్రాతిపదిక కావచ్చును తరువాతి జీవాన్వేషణకు. గురుడిమీదా, శని, యురేనస్, నెప్ట్యూన్‌లమీదా అమ్మోనియా సముద్రాలూ, 'మిథేను' వాయువూ ఉన్నాయట. ఇవీ మరికొన్ని పదార్థాలూ (నీటి ఆవిరి, కార్బన్ డైఆక్సైడు వంటివి) చేరిన మిశ్రమములోంచి రకరకాలుగా విద్యుత్తును ప్రవహింపజేసి, విశ్వవిద్యాలయాల పరిశోధకులు ప్రోటీనును పోలిన అణువుల్ని సృష్టించారు. ఇలాటి పరిస్థితులే ఆయా గ్రహాలలో ఏర్పడవచ్చును గనక ఆ గ్రహములలో జీవము ఉండడము అసంభవమ్ము కాదంటున్నారు రాసాయనికులు.

ఎగిరే సాసర్ల సంచలనము ఇతర గ్రహవాసులను గురించిన ఆలోచనని రేపిందిగాని, విశ్వ మయూఖ (Cosmic Rays) పరిశోధకులు వదలిన బెలూనులేకాని వేరు కాదన్న జ్ఞానముతో ఈ కల్లోలము అణిగిపోయింది.

మన సూర్య కుటుంబ గ్రహములలో అంగారకుడికీ, గురుడికీ నడుమ ఉండిన గ్రహము ఒకటి పేలి ముక్కలైపోయిందనీ, ఆ ముక్కలు సూర్యుడి చుట్టూ తిరుగుతూ భూమికి చేరువగా వచ్చినప్పుడు భూమి వైపు పడిపోతాయనీ అంటారు. అవే ఉల్కలు. ఇవి రాతి సంబంధాలూ, ఇనుము సంబంధాలూ కూడా ఉన్నాయి. వీటిని పగలగొట్టి పరిశోధిస్తే ఏక కణ జీవముల అవశేషములు అమితంగా లభించాయి! అంటే భూమిమీదనే కాకుండా ఇంకొకచోట, భూమిమీదవున్న ఏక కణ జీవములవంటివి ఏర్పడినవన్నమాటే. ఆ ఉల్కలను అరగదీసిన రజమును — డాక్టరు సూక్ష్మజీవులను పెంచడానికని తయారుచేసే—ఆహార ద్రవములోవేసి ఉంచితే మెలి బెట్టిన పుడకల్లాంటి జీవకణాలు తయారయాయి. వైరసు అనే నిర్జీవ స్ఫటిక పదార్థము జీవద్రవాలలోవేస్తే పెరిగేటట్టే నన్నమాట! కొందరు అనుభవజ్ఞులగు వైజ్ఞానికులన్నారుటా, "భూమిమీద తొలిజీవము

ప్రారంభమవుతూండిన కాలములో ఆ జీవకణాలు కూడా అంతరిక్షములో ఏర్పడి ఉండవచ్చును." అని.

భౌతికశాస్త్రజ్ఞులు "ఇతర గోళాలలో జీవమేకాదు, మనకన్నా తెలివిగలవారుఉన్నా"రనే అంటున్నారు. వారు మన భూమిని గురించి ఏమీ పట్టించుకోకపోడానికి కారణము మన సూర్యుడు పాలపుంత అనబడే మన నక్షత్ర విశ్వములో ఒక మూలకి ఉండడము కావచ్చని కొందరంటారు. మానవుడు ఈ భూమిమీద పొడచూపనినాటి సుదూర భూతకాలములో వారు వచ్చి వెళ్ళిపోయి ఉండవచ్చు నంటారు కొందరు. వారి ప్రపంచాలు మనకి కనబడవేమీ అని అడిగితే, మన భూమి సూర్యుడి చుట్టూ లాగే వారి ప్రపంచాలూ ఏ నక్షత్రము చుట్టూరానో తిరుగుతున్నాయీ, ఆ నక్షత్రము కాంతి వారి ప్రపంచముమీదపడి, మళ్ళీ మనదాకా రాలేదుగదా అంటున్నారు.

ఆ ఖగోళవాసులే మనకంటె తెలివిగలవారైతే వారు రేడియో ప్రసారాలు చేస్తూండాలిగదా, ఆ ప్రసారాలను మనము పట్టుకోవాలి అని యత్నిస్తూ రేడియో శాస్త్రజ్ఞులు 'మేసరు' అనే అతి సున్నిత సాధనాన్నీ, దాన్ని జోడించిన రాడారు యంత్రాన్నీ అంతరిక్షములో సూర్యుణ్ణి పోలిన నక్షత్రాలవైపు తిప్పి అటువైపునుంచి వచ్చే సిగ్నల్సును రికార్డు చేస్తున్నారు. ఆ రికార్డింగ్సును, భాషా చిహ్నాలను గుర్తించాలని పరిశీలిస్తున్నారు. అంటే మళ్ళీ మళ్ళీ వచ్చే పంపులూ, గీట్లూ ఉన్నాయా అని శోధిస్తున్నారు.

వీరంతా చేరి ఖగోళాలలోవున్న ప్రాణులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేస్తూంటే మానవులు అక్కడికి వెళ్ళాలిగదా, మానవుణ్ణి అతి శీతల వాతావరణంలో 'ఘనీభవింపజేసి' రాకెట్లలో అక్కడికి పంపేకాలము వస్తుంది, ఆ సన్నివేశానికి తయారవుదామని డాక్టర్లు ప్రాణులను ఘనీభవింపజేసి మళ్ళీ పునర్జీవింపజేసే "కుంభకర్ణ" విద్దను కలిగించే యత్నాలు చేస్తున్నారు. వారికి జయము కలుగునుగాక. ●

# పిచ్చుకగూడు

జ్వాల

"బావా ! ఒక్కసారిటు చూడు, నా గూడెంత అందంగా ఉందో" ఉత్సాహంగా అరిచింది అపర్ణ.

రాజగోపాల్ తలెత్తి చూశాడు. నున్నగా ఇంతెత్తు ఉన్నగూడు పడిపోకుండా వడుపుగా కాలు బయటికి తీస్తోంది. తన గూడు వంక చూశాడు. ఇప్పటి కెన్నిసార్లు కట్టాడో. ఏమిటో ఒక్కసారీ నిలవదు. ఒక్కోసారి కుదిరినా తడి ఇసకమీద అప్పడాలలా తన అరచేతి ముద్రలు అసహ్యంగా ఉంటాయి. కోపంగా మొహం ముడుచుకున్నాడు. బావ సమాధానం చెప్పకపోవటంతో తలెత్తిన అపర్ణ చిందరవందరయిన అతని గూడు చూసి "ఓశ్ ! నీ దింకా పూర్తి కానేలేదు. నాది చూడొచ్చి!"

చురుగ్గా చూశాడు గోపాల్. "గొప్పేలే! మహా ఇందులో ఉన్నాయి తెలివితేట లేలాగయితేనేం."

"ఇంకెందులో లేవేం పాపం ! నీకు మల్లే పుస్తకాలు ముందేసుకు బట్టీ పట్టు ఉంటేనా?" వెక్కిరింపుగా అన్న అపర్ణ మాటలు కోతికి కల్లు పోసినట్లయ్యాయి. విసురుగా లేచి "అనవసరంగా వాగావంటే నాచేత తన్నులు తింటావు జాగర్త—ఏదీ! ఇప్పుడు చెప్పు నీ ఇసుకగూడు ఎంతందంగా ఉందో." గోపాల్ కాళ్ళు తగిలిన ఇసక గూడు కన్నెపిల్ల తియ్యని కలలా చెదిరి పోయి ఉంది. అంత క్షణం క్రితం వరకూ ఎంతో కష్టపడి చేర్చిన ఆ గూడు అలా తన ఏ తప్పు లేకుండానే కూలిపోవడం చూచి కళ్ళు చెమర్చినా ఉక్రోషంతో, కసితో మెరుస్తున్న బావ కళ్ళు చూసి మాట్లాడ్డానికి మాత్రం నోరు రాలేదు.

"అయింది అమ్మాయి పెళ్ళి—లేకపోతే ఒళ్ళు పొగరుగా వాగుతోంది" అంటూ విసవిస నడిచిపోయే బావ వంకే కళ్లార్పకుండా చూసింది. తప్పు తనదే అయినా కూడా బావకి ఎందు కంత ఉక్రోషం, కోపం ఎప్పుడూనో అపర్ణ కర్థంకాలేదు. తనకంటే ఆరేళ్ళు పెద్దవాడయినా బావె ప్పుడూ ప్రతి ఆటలోనూ ఓడిపోతూనే ఉంటాడు. చివరికి కోమటి దివాలాతో దివాలా తీసినా తన్ని బావ బాదిపోతాడు. తొమ్మిదోక్లాసు చదువుకుంటోన్న బావ కెందుకంత 'ఉడుకుమోత్తనమో' పాపం అర్థంకాలేదు ఎనిమిదేళ్ళ అపర్ణకి. ఎప్పుడూ తనే ఓడిపోయినా అవతలివాడికి నాలు గంటించి మరీ వాడు ఓటమి ఒప్పుకునేట్లు చేసిపోతాడు. బావ ఈ వక్ర పరాక్రమంలోని అంతర్యం బుద్ధి వికసించని ఎనిమిదేళ్ళ అపర్ణ కంతుబట్టక పోవచ్చు ! కాని మనస్సు వికసించిన ఇరవయ్యేళ్ళ అపర్ణ కెందు కర్థంకాదు ?

* * *

"అరే చూస్తుండగానే ఎన్నేళ్ళు గడిచి పోయాయి" అనుకుంది అపర్ణ బావ నంబరు ఫస్టు క్లాసులో తనివితీరా చూస్తూ. ఆ నంబరు ననుసరించే గొలుసుకట్టులా ఎన్నో జ్ఞాపకాలు ఎదురు నిలిచాయి. చిన్నతనపు జ్ఞాపకాలు సన్నజాజి పరిమళంలా ఎదుగుతున్న కన్నెపిల్ల హృదయంలో వెన్నెలతో నింపాయి. ఆ విరిసిన వెన్నెల్లో బావ పెంకుతనం కానీ, వంకరబుద్ధులు కానీ కనిపించలేదు. తోచిందల్లా ఒక్కటే, పొడుగ్గా తీవిగా ఉన్న బావ విగ్రహం, మనసుకు మనిషికి ముచ్చటయిన ఆకారం యిచ్చి, నేర్చుకున్న విజ్ఞానానికి, అలవర్చుకున్న సంస్కారానికి రూపంగా నిలిచే ఆ 'డిగ్రీ.'

ఎర్నాడు "ఫస్టు చాప్టులోనే పన్నాలు ఫైనలు పాసయ్యిందే మొద్దవమ్మాయి" అంటూ చిన్నతనంలో లాగానే చెవి మెలి పెడుతున్న చురుగుజ్జులా ఉన్న బావని చూసి



"బావేం ఎదగలేదు" అనుకుంది వయస్సుకి మించిన ఎత్తుకు వెళ్లిన అపర్ణ. ఆ సాయంత్రం "అప్పూ! అప్! ఓ అప్పమ్మా! సినిమా కెళ్దాం పదమ్మా" అంటూ తన గదిలో కొచ్చిన బావని చూసి "అలా పిలవకు బావా చిరాకు నాకు." అంది.

"హోహో—నాజూకు, షోకూ కావొచ్చిందా"

"ఇందులో షోకేముంది బావా— నాదేమంత పెద్ద పేరని—అర్థంలేకుండా ఎందుకా 'షార్టు కట్స్'. అందంగా పూర్తి పేరుతో పిలవరాదా" నెమ్మదిగానే అంది అప్పటికీ ! "నో—అయామ్ సారీ—ఏం చేస్తాం, మేమంటే నాజూకు వాళ్లం కాదు— అయినా నేన్నాయిష్టం వచ్చినట్లు పిలుస్తా! ఇష్టముంటే పలుకు, లేకపోతే మానేయ్!" ఫగం వెటకారంగా జేవురించిన ముఖంతో అంటుంటే "ప్చ్ ! నిజంగానే బావ ఎదగలేదు" అనుకుంది పాపం పిచ్చిపిల్ల !

* * *

రెండేళ్లు గిర్రున తిరిగాయి పోస్టు గ్రాడ్యుయేటయి వచ్చాడు రాజగోపాల్ ! "ఫర్దర్ ప్రోగ్రాం ఏమిటి బావా. పి. హెచ్. డి. చేస్తావా" అన్న అపర్ణ మాటకి "ఉహూఁనా కా ఉద్దేశ్యం లేదు. మొదట ఎక్కడయినా జాబ్ చూసుకుని తరువాతేదయినా కాంపెటేటివ్ ఎగ్జామినేషన్‌కి వెళ్లాలనుంది అప్పూ!" అన్నాడు రాజా ఎప్పటి లాగానే ఏడాది తిరక్కుండా ఆఫీసరు హోదాలో అడుగుబెట్టిన అల్లుణ్ని చూసి మురిసిపోతూ "ఆ మూడు ముళ్లూ కానిచ్చేయ్ కూడదూ" అన్నాడు అపర్ణ తండ్రి. "తొందరేముంది మామయ్యా— అప్పు అయినా పూరికే ఏం లేదుకదా. నాకింకా ట్రైనింగ్ గట్రా ఉంటాయ్. అది పూర్తయేటప్పటికి అప్పు కూడా డిగ్రీ పుచ్చుకుంటుంది." అన్నాడు రాజగోపాల్— పెళ్ళి పేరట చదువు కట్టువేస్తాడేమో ననుకున్న బావ అలా అనేప్పటికి పొంగిపోయింది అపర్ణ. "ఈ మంచితనం ముందున్న సంకుచితనం కేవలం మైనం లాంటిది, ప్రేమ అనే దీపశిఖ వేడిమి కయినా కరిగిపోదా" అనుకుందా వెర్రి పిల్ల !

ట్రైనింగు అనంతరం తిరిగి ఆ వూళ్లోనే పోస్టింగు అయింది. వూళ్లో అడుగుపెడ్తూనే "ముహూర్తం పెట్టించమా మామయ్యా...." అన్నాడు.

"బి యస్సీలో క్లాసొచ్చింది ఎమ్మెస్సీలో చేరిందిరా. ఇంకెంత ఒక్క సంవత్సరం. ఇన్నాళ్లూ ఆగాము. ఈ కాస్తా పూర్తి కానీయి" అన్నాడాయన. రాజగోపాల్ కళ్లు కోపంతో ఎరుపెక్కాయి. "నాతో చెప్పకుండా ఎందుకు జేర్పించారు ?"

"అదేమిట్రా. డిగ్రీ కోర్సు పూర్తి చేయించమని నువ్వే అంటావాయే. సరే దీనికి మాత్రం అడ్డొస్తావా అన్నట్లు చేరింది" ఆయన తెల్లబోయాడు.

"చదివింది చాల్లేదా—ఎన్ని చదివినా చేసేదేముంది—తిరిగి పెళ్లాడటమూ—" అపర్ణ మనస్సు చివుక్కుమంది. ఎంత తేలికగా మాట్లాడుతున్నాడు బావ ! ఇలా మాట్లాడే బావేనా అంత చదువు చదివింది ? ఇంత పెద్ద పదవిలో ఉంది ? అందరిలో అంత సంస్కారయుతంగా మెసిలేది ? మనస్సుని కప్పిన నల్లతెర తొలగలేదు—

రాజా సాయంత్రం ఏదో ప్రోగ్రాము వేశాడు. అన్యమనస్కంగానే లేచింది అపర్ణ నిరాడంబరంగానే అయినా చందనపు

# పిచ్చికగూడు

బొమ్మలా అలంకరించుకు వచ్చిన అపర్ణని ఓ క్షణం పరకాయించి చూశాడు రాజా. "ఉహూ—నాకు నచ్చలేదు."

"చిన్నపిల్లలా ఆ రెండు జడ లేమిటి? ముఖాన ఎర్రటి కుంకుమకి మారుగా ఆ పెన్ను పులుముకోడ మేమిటి? జబ్బలు కనిపిస్తూ ఆ జాకెట్టేమిటి? వెళ్ళి మార్చుకురా" నియంతలా ఆజ్ఞాపిస్తున్న అతన్ని చూస్తూ నోట మాట రాలేదు.

"బావా! నాకూ ఆలోచన, అభిరుచి ఉంది. అంత తేలిగ్గా తీసెయ్యకు—" దెబ్బతిన్న హృదయం అడిగింది.

"ఏ అచ్చు చదువుకున్న ఆడదానిలా మాట్లాడుతున్నావే! అదంతా నాకు పట్టదు. నాకు నచ్చలేదంటున్నా మార్చుకురా."

"ఇందులో చదువుకోడం చదువుకోక పోడం ప్రసక్తి లేదు. నీకు తృప్తి కల్గేట్లు ప్రవర్తించడం నాకు సంతోషకరమే కావచ్చు. కాని అంతమాత్రాన బొమ్మగా మార్చాలనుకోడం మాత్రం ...." బాధగా ఆగిపోయింది.

"ఆ ఉపన్యాసాలు, స్వతంత్ర భావాలు తర్వాత వల్లిద్దు గాని—ఇంతకీ మార్చుకుంటావా మార్చుకోవా?" అపర్ణ కళ్ళెత్తింది. కాఠిన్యం మూర్తీభవించినట్టున్న ఆ ముఖం, చూడగానే ఒక విధమైన నిర్లిప్తత ఆవరించింది.

తనెంత ఉత్సాహపరుస్తున్నా ముంగ కొండిగా ఉండిపోయిన మరదల్ని చూసి నొచ్చుకున్నాడు రాజగోపాల్. తను పొరబడ్డాడా? తనకి నచ్చలేదు. అదే చెప్పాడు. ఆవిధంగా నడుచుకోటం ఆమె విధి కాదా మృదువుగా భుజాల చుట్టూ చేతులు పోనిచ్చి "అలా ఉన్నావేం కోపం వచ్చిందా?" లాలనగా అడిగాడు.

ఆ చేతుల్ని కోపంగా విసిరికొట్టనూ లేదు. తన అక్కసంతా తీర్చుకోనూ లేదు. జీవంలేని ఒక్క నవ్వు మాత్రం నవ్వి పూరుకుంది.

అపర్ణకి పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. ఉన్నట్టుండి ఒకరోజు రాజగోపాల్ వచ్చి "అపూ—నా ఫ్రెండ్సు కొంతమంది పిక్నిక్‌కు వెళ్ళామంటున్నారు. రేపు ఆదివారం ప్రోగ్రాం వేశాను. ఉదయం ఏడు కొట్టేటప్పటికి వస్తాము. రెడీగా ఉండాలి తెల్సిందా?" "ఊ" అంది ఉత్సాహంగా. అప్పట్నుండే పిక్నిక్‌కు ఏం తీసుకు వెళ్ళాల్సింది, ఎలా గడపాల్సింది, ఎన్ని పాటలు పాడాల్సింది ఆలోచించుకుంటూ, ఊహించుకుంటూ గడిపింది.

అనుకున్న ఆదివారం వచ్చింది. పొద్దుట్నుండీ ఒకటే కంగారు పడ్తోంది అపర్ణ. స్నాక్సు, బిస్కెట్లు, పళ్ళూ బుట్టలో సర్దింది. రికార్డు ప్లేయర్, రికార్డులు తీసిపెట్టింది.

ఏడు అయ్యేటప్పటికి తను రెడీ అయి కూర్చుంది. ఏడున్నర అయ్యేటప్పటికి బిల బిలమంటూ అంతా వచ్చేశారు. రాజగోపాల్ ఒక్కొక్కరినే ఇంట్రడ్యూస్ చెయ్యటం మొదలెట్టాడు. "ఈయన అసిస్టెంటు ఇంజనీయర్ వరదరాజు. ఇతను డాక్టర్ శ్రీరామ్. ఇన్సూరెన్స్, తెలుగు రాదు. సరే, ఇతను మిస్టర్ రావు లెక్చరర్, ఎన్. సి. సి. లెఫ్టినెంట్, సరే ఈమె తెలుసు మిసెస్ మిశ్రా. ఆయనకి అర్జెంటుగా హెడ్డాఫీస్ నుండి కాల్ వచ్చింది. అందుకు రాలేదు. వీ రిద్దరూ మిస్టర్ అండ్ మిసెస్ మహేంద్రదేశాయి. గుజరాత్ వాళ్ళు. ఈమె నా మరదలు మిస్ అపర్ణ."

పరిచయ వాక్యాలు ముగిసాయి. ఇంతమందిని ఇన్ని రకాల జాతులని కల్సుకోడంతో అపర్ణకి ఉత్సాహం రెట్టింపయింది. అసలే మాటకారి. చురుకుగా తిరుగుతుంది. ఇక ఈ ఉత్సాహం పట్టనలవి కాకుండా ఉంది. అందరికి కాఫీ అందజేసింది. సరదాగా కబుర్లు, జోక్సు చెప్పుకుపోతోంది. కార్లో కూర్చున్న తర్వాత, మిసెస్ మిశ్రాకి మిస్టర్ అండ్ మిసెస్ దేశాయికి తెలుగు రాదని తెల్సుకున్నాక నెమ్మదిగా అంది బావతో "అందరితో "ఫియన్సీ?" అని చెబుతా ననుకున్నాను. సింపుల్‌గా మరదలు అని పూరుకున్నావే?" కొంటెగా నవ్వాడు రాజా. "తొందరగా

ఉన్నట్లుండే—నాల్గురోజు లాగు. ఏకంగా మిసెస్ అనే పరిచయం చేస్తాను.''

"మిసెస్ అని చెప్పటంలో ప్రత్యేకతే ముంది? 'ఫియన్స్' అంటే కొంత ఉత్సుకత ఉండేది.'' జీవితంలో మార్పుని, క్రొత్తనీ వాంఛించే అపర్ణ అభిలాష అది. కానీ రాజు కివ్వన్నీ ఎబ్బెట్టుగా ఉంటాయి. పది మంది ముందు ఒకళ్ల కోసం ఒకళ్లం ప్రాణం విడుస్తున్నట్లు నటించడం, చెట్టాపట్టా లేసుకు తిరగటం, ఆడదాని ముందు వినయాన్ని నటించడం ఇవ్వన్నీ ఏవో నటనలా ఫీలవుతాడు. అందుకే మాట్లాడక వూరుకున్నాడు. నవ్వులలో, చప్పట్లలో, పాటలలో గమ్యస్థానం చేరారు. నిమిషాని కొకటి తినటమూ, ఒకరిపై ఒకరు జోక్సు విసురుకోడం. వాతావరణం హుషారుగా ఉంది. అంతా చిన్న పిల్లల్లా కేరింతాలు కొడ్తుంటే రాజగోపాల్ మరో ఉత్సాహాన్ని చూపకుండా ముభావంగా ఉండటం మాత్రం అపర్ణను కొంత నిరుత్సాహ పరచింది. స్వతహాగా నెమ్మదస్తుడు కావచ్చు, కాని యిలా పదిమందిలోకి వచ్చినప్పుడన్నా మన ఉత్సాహపు రెక్కలు విప్పక పోతే ఎలా ? ఆలోచిస్తూనే రికార్డు ప్లేయర్ బయటికి తీసింది. ఎవరో ట్రాన్సిస్టర్ ట్యూన్‌చేస్తున్నారు. "అబ్బబ్బ! ఇంతమంది లేడీస్ ఉన్నారు. ఇప్పుడూ లతా, సుమన్ కంఠాలనేనా వినటం ? ఉయ్ వాంట్ ఛేంజ్! కమాన్ గివ్ అజ్ ఏ సాంగ్'' డాక్టర్ శ్రీరామ్ ఉత్సాహంగా అన్నాడు

ఆ మాటతో ఎవ్వరూ మాట్లాడలేదు. ఎవరికి వారు ప్రక్కవాళ్లను బతిమాలే వాళ్లే—

"మిస్ అపర్ణా ! మీరు పాడండి— వాట్‌మిస్టర్ రాజ్ ! ఆమె పాడగలరు గదా—'' తిరిగి శ్రీరామ్ కల్పించుకున్నాడు.

"బ్రహ్మాండంగా పాడుతుంది. ఊ అపూ! కమాన్''

అపర్ణ చురుకుగా బావని చూసింది. మరుక్షణంలో ఆమె కంఠం తేనెలను కురిపించింది. ఎవరికి వారు నిర్విణ్ణులే అయ్యారు. ఆ తియ్యదనం అందర్నీ బొమ్మల్లే చేసింది. పాట ఆపగానే ఒక్కుమ్మడిగా "వండ్రఫుల్" అన్నమాట ప్రతిధ్వనించింది పాటలంటే చెవి కోసుకునే రావు, పాడటంలో కొద్ది ప్రవేశమున్న శ్రీరామ్ ముందుకొచ్చారు.

చెరో ప్రక్కన కూర్చుని "ప్లీజ్, ఇంకో పాట.'' 'ఇంత బాగా పాడ్తారనుకోలేదు', 'పొరబాటున కూడా మీ పాటలో లయ తప్పదు'—'ఈసారి హిందీపాట', యిలా మొదలుపెట్టారు. అపర్ణ నిస్సహాయురాలైంది. సాధారణంగా తనకి ఎవరన్నా పాడమంటే పాడకపోటం అలవాటులేదు. అందునా అంత అభిమానంగా వా రడుగుతుంటే—మరో రెండు పాటలు పాడి బావ వైపు సంతృప్తిగా చూసింది. అసలు మాట్లాడకుండా ఏదో తీక్షణంగా చూస్తున్నాడు అతను అపర్ణ సంతోషం యిగిరి పోయింది. అందుకే వాళ్లు తిరిగి బతిమాలుతున్నా "క్షమించండి'' అంటూ అక్కడ్నించి లేచిపోయింది. తోటలో అటూ యిటూ తిరిగి వచ్చేటప్పటికి రావు తుపాకి గురిపెట్టి పక్షుల్ని వెదుకుతున్నాడు. అది చూడగానే తిరిగి ఉత్సాహం పుంజుకుంది. తుపాకీ గురి చూడాలన్నది తన కోర్కెల్లో ఒకటి. అతని దగ్గరగా వచ్చి "లెట్‌మీ ట్రై ప్లీజ్'' అంది.

అతను చిన్నగా నవ్వుతూ అందించాడు.

"మీ కసలు ప్రాక్టీసు ఉందా. మొదట దీనిలోనుండి గురి చూడాలి. ఎదురుగా ఉన్న 'ఎయిమ్' ఈ రెండు ఒకే లైన్‌లో ఉండాలి. ఆ తర్వాత వూపిరి బిగబట్టి నొక్కండి'' అన్నాడు. అతను చెప్పినట్లే చేసింది. గురి తప్పింది. పిట్ట ఎగిరి పోయింది. "అరె ! ఉహూఁ మొదటిసారే పిట్టల వేటలో పడితే లాభంలేదు మొదట ఒక రాయో, చెట్టో గుర్తుగా పెట్టుకుని ప్రాక్టీసు చెయ్యండి'' అన్నాడు తిరిగి గురి తప్పింది. మరో రెండుసార్లు ప్రయత్నించింది. ఆఖరిసారి అంటూ అందుకుంది. లిప్పగా గురిచూసి వేలు నొక్కింది. గుండు సూటిగా వెళ్లి ఎదుట ఉన్న రాయికి తగిలి పడిపోయింది. "వెరిగుడ్— క్విక్ గ్రాస్పింగ్'' అంటూ చేయి ముందుకు చాచాడు. లక్ష్యాన్ని సాధించిన ఆనందంలో, రెట్టించిన ఉత్సాహంతో అప్రయత్నంగా ఆ చేతి నందుకుంది అపర్ణ. అభినందన సూచకంగా మృదువుగా నొక్కి వదిలేశాడు. ఉరుకుతూ బావ దగ్గర వచ్చి చేయి చాస్తూ "చూశావా కొట్టేసాను'' అంది. అంతకుముందు ఆమె షాట్ చూసి విద్యుద్దీపంలా వెల్గిన ముఖం ముడుచుకు పోయింది.

"బాగుంది— కానీ అంత పొంగిపోవలసిన



అవసర మేమిటి ?" వినుగ్గానూ, మరుగ్గానూ విన్పించిన ఆ మాటలు ఆమెలోని ఉత్సాహాన్ని ఆమెని కూడా చంపేశాయి. 'ఎందుకంత కరుగ్గా మాట్లాడ్తాడు. అసలా మౌనం ఎందుకు. తనలోని 'టాలెంట్స్' మరొకళ్ళు మెచ్చుకుంటుంటే యీర్ష్యపడుతున్నాడా ?'

బాయ్ టీ తీసుకువచ్చాడు. ఎక్కడెక్కడో తిరిగివచ్చిన మిసెస్ మిశ్రా సీటుకోసం అటూ యిటూ చూస్తోంది. చటుక్కున కుర్చీలోంచి లేచి "ప్లీజ్, మీరు కూర్చోండి' అన్నాడు రాజా, బాయ్ తెచ్చిన టీ ముందర లేడీస్‌కి ఆఫర్ చేస్తూ. "సంస్కారం!" నవ్వుకుంది అపర్ణ. మనస్సంతా మూగబోయింది. ఆ తర్వాత ఎంతమంది యిలా ప్రయత్నించినా ఆమె ముఖంలో నవ్వు చూడలేకపోయారు.

"అరే, ఏమయింది ?"

"సడన్‌గా మౌనం ధరించేస్తున్నారు."

"హెల్త్ బాగాలేదా" యిలా అంతా అడుగుతున్నా మాట్లాడలేదు. మానసికంగా ఒంటరి అయిపోయింది. అలా తను ముభావంగా ఉండటం అనాగరికచిహ్నంగా తలచి కావ చూసే చూపులు తనని బాధించటం లేదు. చేతిలో ఏదో నవల పట్టుకు ఒక చెట్టు నీడను కూర్చున్న అపర్ణ ప్రక్కకి వచ్చి కూర్చున్నాడు శ్రీరావ్.

"ఇందాకటి నుండి చూస్తున్నా. ఎందు

# పిచ్చుకగూడు

కలా ఉన్నారు ? సడన్‌గా డల్ అయిపోయారే."

మృదువుగా నవ్వటానికి ప్రయత్నిస్తూ "ఏమీలేదు. కొద్దిగా తల నొప్పుతోంది."

"అరెరే, చెప్పారుకారేం. నాదగ్గర టాబ్లెట్స్ ఉన్నాయి. ఇస్తానుండండి."

"చంపారు పొండి! ఇక్కడకొచ్చినా మీరు డాక్టరన్న సంగతి మర్చిపోకపోతే ఎలా ?" దూరంగా రావు, దేశాయి రాజా కూర్చుని ఉన్నారు. రావు సిగరెట్ ముట్టించి దేశాయి రాజాలకి ఆఫర్ చేస్తున్నాడు. దేశాయి తీసుకున్నాడు. కాని రాజా 'వద్దన్నట్టు' చిన్నగా నవ్వుతూ తలాడిస్తున్నాడు.

దీర్ఘంగా నిట్టూర్చింది అపర్ణ హృదయము.

అతడు సిగరెట్, త్రాగడు. 'కంపెనీ' కోసమన్నా 'డ్రింక్సు' పుచ్చుకోడు— పదిమంది దృష్టిలో అతడు సుశిక్షితుడు. సహృదయుడు. కలుపుగోలుతనంగా ఉంటాడు—! తెలివిగలవాడు—!

తిరిగి తలెత్తి చూసింది. రాజా చూపులు సూదుల్లా తామిద్దరివైపు ప్రసరిస్తున్నాయి. బాధగా మూలిగింది అపర్ణ హృదయం. మనస్సులో సుహృద్భావాలు లేనప్పు డిలాటి సమావేశాలు ఏర్పాటు చెయ్యటం ఎందుకో ? మనం ఉత్సాహంగా నల్గురిలో కలిసి మెలిసి తిరగలేనప్పుడు యిలా వచ్చి నల్గురిలో కలిశాగావటం ఎందుకో ? బాధగా నిట్టూర్చి చటుక్కున లేచింది అక్కడనుండి. ఆమె లేవడం చూచి తనూ లేస్తూ "ఇవేం వళ్ళు, యింతందంగా ఉన్నాయి" అన్నాడు శ్రీరావ్. అపర్ణ చటుక్కున తలెత్తింది పకపకా నవ్వాలనిపించింది.

"అవును!—చాలా అందంగా ఉంటాయి పైకి...మేడిపళ్ళు!" అంది. నిర్లక్ష్యంగా నవ్వుతూ—!

* * *

పరీక్షలు ముగిసాయి. ఇంకా ప్రాక్టికల్సు ఉన్నాయి. మామయ్య ద్వారా అపర్ణ మాటలు అభిప్రాయాలు విన్న రాజా గుండెగొక్కుంటూ వచ్చాడు అపర్ణ దగ్గరికి. "ఏమిటి? అపూ! నేను విన్నది నిజమేనా— కాదు అపూ! కాదని చెప్పు" నిరాశ నిండిన కళ్ళతో తన వైపు చూస్తూ బాధగా అడిగిన బావనిచూసి కళ్ళు తిప్పుకుంది. "మాట్లాడవేం".

ఎలాగో తెప్పరిల్లుకుని "ఇప్పుడుకాదు— సాయంత్రం బీచికిరా. తీరిగ్గా కూర్చుందాం" అంటూ, అతని జవాబుకన్నా ఎదురుచూడకుండా లాబ్ వైపు నడిచిపోయింది.

* * *

"చెప్పు అపూ! ఇప్పుడు చెప్పు. మామయ్య చెప్పిందంతా ఉత్త అబద్ధమని. కేవలం నన్నాడించటానికన్నాననీ చెప్పు." ఇసుకపోగు చేస్తున్న అపర్ణ చెయ్యి పట్టుకుని అడిగాడు రాజగోపాల్. మృదువుగా చెయ్యి విడిపించుకుంటూ తలవంచుకుని అతి నెమ్మదిగా అంది అపర్ణ, "లేదు బావా! నువ్వు విన్నది అక్షరాలా నిజం. నేను నిన్ను చేసుకోనని చెప్పినమాట వాస్తవమే!"

"ఆఁ! నాలో ఏం లోపం కన్పించింది? ఎందుకు నీకు తగనివాణ్ణనుకున్నావు!

"ఇందులో లోపాల ప్రసక్తి లేదు. ఈ లోకంలో లోపంలేని జీవిలేదు. కాని బ్రతుకంతా సన్నిహితంగా సంచరించవలసిన వ్యక్తిలో కొన్ని కొన్ని అభిప్రాయాలు, అలవాట్లూ నచ్చకపోవడమే కారణం!"

"ఏమిటది! నా ప్రేమపట్ల నీకు నమ్మకం లేదా!"



# పిచ్చుకగూడు

"హా! ప్రేమ! ప్రేమ ఒక్కటేకాదు బావా జీవితాన్ని సౌఖ్యవంతమూ, సంతృప్తికరమూ చేసేది! అవతలి వ్యక్తి మనల్ని ఆరాధిస్తున్నాడన్న ఆలోచన, భావన ఒక విధమయిన హాయిని తృప్తిని యివ్వవచ్చుకానీ, అడుగడుగునా బలయ్యే వ్యక్తిత్వమూ, ఆత్మ గౌరవమూ కన్న—బలయిపోయే ప్రేమే బలహీనమయింది.

ఎందుకోబావా! చిన్నతనంనుండీ నాకు చామంతులూ బంతిపూలూ నచ్చేవికావు! "పసిమి ఛాయగల వాటిని మెచ్చుకోలేకపోడం నీ దౌర్భాగ్యం" అనేవారు స్నేహితులంతా! కావచ్చు! కాని నాకు మాత్రం ఎందుకో ఏమాత్రమూ తావిలేని ఆపూలు ఆనందా విచ్చేవికావు. ఎంతందముంటేం మాత్రము సువాసనలేకపోయాక, అన్పించేది! అలాటిదే నీ ప్రేమ. నీ ప్రేమకి ఆకారమే కాని ఆహ్లాదాన్నిచ్చే గుణం లేదు—!"

"అప్పూ! హద్దుమీరి అవమానిస్తున్నావు"

"పొరబాటుబావా! ఇది అవమానించటం కాదు. నిజం నిష్కారంగా చెబుతున్నాను. దాంపత్యంలో జీవితం ఆదర్శప్రాయమూ, సుఖదాయకమూ కావడానికి ప్రేమ ఒక్కటే చాలదంటున్నాను. సామరస్యమూ సానుకూలత, అవతలివ్యక్తిని అర్థం చేసుకోగలగటమూ, అన్నింటికీమించి పాటి వ్యక్తిని గౌరవించగలగటమూ ముఖ్యము.

తోటి మనిషినీ, మనసునీ—అలానే కూడలేని నువ్వు గౌరవించగలవనుకోడం అపోహ కాదా? పరస్పరం చుక్కెదురయిన అభిప్రాయాల్ని, విరుద్ధమైన యీ వ్యక్తిత్వాల్ని ఒకరిపై ఒకరం వేసుకు రుద్దాలనుకోడమూ, కలవని మార్గాలలో ఒకరి నొకరు ద్వేషించుకుంటూ, ఒకరి వ్యక్తిత్వాన్ని మరొకరు అవమానించుకుంటూ, ఒకరి భావాలను మరొకరు ఎత్తిపొడుచుకుంటూ చివరికి అవతలి మనిషిమీద ఉండవలసిన కనీస గౌరవభావాన్ని చంపుకుని, ఏదో మంత్రం బంధించింది కదా అని తప్పని

వరికి, మరో మాటలో—మరో దారిలేక— ఒకే గదిలో బంధించబడ్డ ఎలకా పిల్లిలా అనుక్షణం కొట్లాడుకుంటూ, దానికి అభిమానం, ప్రేమ జీవితం, పవిత్రతవంటి బురఖాలు కప్పేకంటే ఇలా స్నేహితులుగా విడిపోటం మంచిదికాదా?"

"నాలో అంత అల్పమైన భావాలేం కన్పించాయి నీకు ? నా స్నేహితులు వల్గురిలో విన్ను తిప్పలేదా ? నీవు చదువుకుంటానంటే వద్దన్నానా ? నీ యే అభిరుచికి ఆటంకం అయ్యాను? చివరికి పదిమందిలో నీవు గాయనిగా, విద్యావతిగా నిలబడడానికి తోడ్పడింది నేకాదా?"

నవ్వింది అపర్ణ ! "అక్కడేవుంది బావా చిక్కు. కొంతమందికి కుక్కలంటే యిష్టం లేకపోయినా— మేలు జాతికుక్కల్ని పెంచటం అలవాటు చేసుకుంటారు. ఏందుకు? పదిమందిలో గొప్పకోసం. ఏ ఏ పుస్తకాలున్నాయో తెలీకపోయినా 'మా యింట్లో లైబ్రరీవుంది' అంటారు. దేనికి? పదిమందీ తనవో అభ్యుదయవాదిగా తలబోసేటందుకు. పై అలవాట్లలాగానే "నాభార్య చదువుకుంది" అని చెప్పుకోడం ఫ్యాషన్ అయిపోయింది. పదిమందికీ పరిచయం చెయ్యడంలో తన సోషల్ బిహేవియర్ తెలుస్తుందన్న ఆశ. కాని ఆమె ఎవ్వరితో మాట్లాడకూడదు ముద్దరాలులా కూర్చోవాలి! పెళ్లాం చదువుకోవాలి! కాని తన మాట కెదురాడకూడదు. కనీసం యిది నా అభిప్రాయం అని చెప్పడానికి కూడా అవకాశంలేదు. పదిమందిలో సోషల్‌గా తిరగాలి. కాని పరాయివాణ్ణి కన్నెత్తి చూడకూడదు. మాట్లాడకూడదు. అమ్మమ్మలు పనికిరారు. కాని ఆడదానికి అమ్మమ్మ భావాలుండాలి! ఇదీ యీనాటి చదువుకున్న మగవారి కోర్కె! పురోగమనం, అభ్యుదయం, సమాన గౌరవం యివన్నీ మాటల్లో, కాగితాల్లో? కాని చదువుతోపాటు సంస్కృతితో బాటు సంస్కారాన్ని సమకూర్చుకుని పురోగమించే ఆడదానికి పొత్తెలా కుదురుతుంది? ఇంతదాకా ఎందుకు? నీ మాటేమిటి? స్నేహితులకి, తదితరులకీ, నువ్వు సహృదయుడివి. మంచివాడివి. సంస్కారివి. కాన్ని నా బుద్దెరిగిం తర్వాత మనిద్దరి మధ్యా జరిగిన ప్రతిసంఘటనా నాకు గుర్తుంది! ఎన్నోసార్లు నన్ను నే సమాధానపర్చుకున్నాను. నీ మౌఢ్యాన్ని, మంకుతనాన్ని మొదట చిన్నతనంగాను, తరవాత అలవాటుగానూ అర్థం చేసుకున్నాను. నీ అభిరుచికి తగ్గట్లు అలంకరించుకోడంలోనూ, అభిప్రాయాలు మార్చుకోడంలోనూ అతికష్టమే అయినా అలవాటుపడగలనేమో. అది జీవన ధర్మం అని సరిపెట్టుకోగలనేమో— కాని జీవితానికి ప్రాతిపదికలోనే ఒకరికొకరం చుక్కెదురు. నేను సెలయేటిలా ఉత్సాహంతో పరుగు బెట్టాలనుకుంటే నువ్వు శిలలా అడ్డు తగలాలనుకుంటావు. మెత్తగా పాడటమూ, చెప్పింది జ్ఞాపకం పెట్టుకోగలగడమూ, అలాటి నా జన్మలక్షణాల్లో ఒకటి నా చురుకుతనమూ. కాని అది నీకు నా స్వేచ్ఛా ప్రవృత్తికీ, చదువు నేర్పిన విచ్చలవిడితనానికి నిదర్శనంగా తోస్తుంది. బావా! నేనూ చదువుకున్నాను. నాకూ స్నేహితులూ, అనుభవాలు అనుభూతులూ వున్నాయి. నాబుద్ధికి తోచినట్లు, హృదయం ఆదేశించినట్లు నా వ్యక్తిత్వానికి రూపురేఖ ఇచ్చుకున్నాను. వ్యక్తిత్వం గడ్డిపోచ కంటె అల్పమనీ, దూదిపింజ కంటె తేలికనీ నేనెన్నడూ అనుకోలేదు! ఒక్క విషయం బావా! పవిత్రత మనస్సుకి సంబంధించినది. శరీరానికి కాదు. నాకో విషయం గుర్తొస్తోంది. బి. యస్సీ.లో ఉండగా కాబోలు ఒకనాడు ప్రాక్టికల్సు చేస్తున్నాను. ట్యూబులోకి సల్ఫ్యూరిక్ ఆసిడ్ కాన్‌సెన్‌ట్రేటెడ్ వంపుతున్నాను. సరిగ్గా పట్టుకుదరలేదు. ఒకే ఒక్కక్షణం! సీసా చేతిలోంచి జారిపోయేదే. పూరేకుల కన్న మెత్తగావున్న యీచేతులతో లేక మరోటో నల్లగా కమిలిపోయేదే! ఎప్పుడొచ్చారో ఏమో! నా ప్రక్కన నుంచుని నా చేతిలో నుండి సీసా అందుకున్నారు మాస్టారు. కృతజ్ఞతాపూర్వకంగా నవ్వాను. ముసలాయనకాదు. అంతకుముందు ఏడే ఎమ్మెస్సీ చేసి వచ్చారు. ఆయనలా నాచేతిలో నుండి సీసా తీసుకోడంలో నాచెయ్యి ఆయన చేతిని తాకింది. కాని ఆ తర్వాతెప్పుడూ ఆసంగతి ఆయనా పట్టించుకోలేదు, నేనూ పట్టించుకోలేదు.

'మరోసారి థర్డుయియర్‌లో వుండగా వనభోజనానికి వెళ్లాం. కనుచీకటి పడుతుండగా అంతావెళ్లి బస్సులోకూర్చున్నారు. నేను జాయింట్ సెక్రటరిని. నేనూ, సెక్రటరీ రామం అన్ని సామాన్లు పెట్టారో లేదో చూసుకుని వస్తున్నాము. నేను తలవంచుకుని మెల్లిగా నడుస్తున్నాను. ఉన్నట్లుండి ఎవరో చెయ్యి పుచ్చుకు లాగినట్లయి తిరిగాను. రామం చెయ్యి పుచ్చుకు దగ్గరగా లాక్కుంటున్నాడు. కళ్లెర్ర చేసి చూశాను. అతను చూపుడువేలు ఎదురుగా సారించాడు. చూశాను. బారెడు నల్లత్రాచు జరజర ప్రాకిపోతోంది. ఒక్కసారి వులికి పట్టమేకాక చటుక్కున భయంతో అతన్ని మరింత వాటేసుకున్నాను. నా వెన్నుపై నున్న అతని



# పిచ్చుకగూడు

చెయ్యి భయం లేదన్నట్లు మెల్లగా విడి రింది. మర్నాడు కాలేజీలో అడుగు పెట్టటం తోనే అతడు కన్పించాడు. నన్ను జూచి నవ్వాడు. ఆ నవ్వులోనూ, కళ్ళలోనూ ఎటువంటి కాలుష్యమూ లేదు. ఆ అనుభవం తాలూకు సంచలనమూ నాలోనూ లేదు. తర్వాత చాలారోజులు కలిసి చదువుకున్నాం. కాని మాకెన్నడూ ఆవిషయమే గుర్తు రాలేదు. ఎందుకు చెబుతున్నానంటే బావా! మరో పురుషుడు నాచెయ్యి తాకినంత మాత్రాన నే తప్పుగా భావించను! నా పాతి వ్రత్యం అడుగంటిపోయినట్లు, నా పవిత్రత మంట కలిసినట్లు నేననుకోను! అస్పర్శ తాలూకు అనుభూతి సంచలనమే నాతో బాటు పెరిగిన స్త్రీ స్పర్శలానే తోస్తుంది. ఇది నా సహజలక్షణం కావచ్చు లేదా 'ఎదిగిన నా మనసు' విస్తరించిన ఛ్ఛాయ కావచ్చు' చూశావా బావా! ఇటువంటి విషయాల్లో నువ్వు సమాధానపడటమూ కష్టమే అవు తుంది. నే ఎర్పుకుపోటమూ దుర్లభమే అవుతుంది. ఎదుగుతున్న నాతో బాటూ, నా చదువుతో బాటు నామనస్సూ ఎదిగింది, కాని నువ్వు—నువ్వు ఎదగలేదు బావా, ఎగద లేదు— నువ్వు పెరిగావు. చదువుకున్నావు. పైకొచ్చావు. కాని ఎక్కడో మారుమూల కొడిగట్టిపోయిన దీపం తాలూకు వెల్తురులో, మసిబారిపోయిన యింటి వాతావరణంలోని మకిలీ, చెత్త, బూజు మాత్రం నిన్ను వదల్లేదు—!"

"అవూ—"

"అవును—ఈ దేశంలో చాలామంది ఆడ వాళ్ళున్నారు. పెళ్ళయితేనే చాలని అను కునే వాళ్ళున్నారు. వాళ్ళలో ఏవక్కరికీ నీవు భర్తవైనా నిన్ను దైవంలా కొలు స్తుంది. నీ అభిప్రాయాల్ని, శాసనాల్ని మన్నిస్తుంది. కాని నాలా పెరిగిన వ్యక్తి త్వం వున్న ఏ ఆడపిల్లా నీతో సుఖపడలేదు". ఒక్కక్షణం మౌనం. "ఇన్ని మాటలెందుకు? ఒక్కమాట — ఒక్కమాట చెప్పరాదూ— నీ మనసు మరొకడిమీదకు మళ్ళిందని."

కాలి మీద పాముకున్న ఇసుకని మసాజు చేస్తున్న అపర్ణ కటువుగా విన్పించిన ఆ మాటలకి పిడుగు దెబ్బతిన్న దాన్లా తలె త్తింది "బావా!......ఇది మనసు బావా—గాలికాదు—"

"ఇకెందుకీ మాటలు?"

"లేదు బావా ఒకవేళ నువ్వెవరో సరిగా తెలీకుండా నిన్ను చేపట్టివుంటే అది నాకర్మ ఫలితమనో, అంతే రాసిపెట్టుందనో తృప్తి పడేదాన్నేమో—కానీ నీ మనస్తత్వపు ఆఖరి మెట్టుతో పరిచయం వున్న నేను..." అపర్ణ పూర్తి చేయలేకపోయింది. నిశ్శబ్దం భయం కరంగా రాజ్యం చేస్తోంది. కాస్సేపుండి అపర్ణ తలెత్తి చూసింది. అతను తీవ్రంగా సముద్రం వైపు చూస్తున్నాడు. మధ్య మధ్య అతని కనుబొమలు ముడుచుకుని విడిపోతున్నాయి. క్రింద పెదవి పంటి మధ్య నలిగిపోతోంది. అలా వున్నాడంటే అతనికి తీవ్రంగా కోపం వచ్చిందన్నమాట. విన్నగా నిట్టూర్చి తలదించుకుంది.

"మంచిది. వస్తాను. నీకు నచ్చినవాడు, నీ అభిప్రాయాల్ని గౌరవించేవాడు రావాలని కోరుకుంటున్నా" చేతుల కంటిన ఇసుక దులుపుకుంటూ లేచాడతను. తలెత్తకుం డానే "చెప్పలేను బావా ఏ లక్షణాలు నీలో నాకు నచ్చక వదులుకుంటున్నానో, ఆ లక్ష ణాలు కల వ్యక్తి కోసం నా అన్వేషణ సాగ వలసిందే. ఒకవేళ నేనెప్పటికయినా పొంద లేకపోయినట్లయితే బహుశ నా జీవన మార్గమే మార్చుకుంటాను" బరువుగా అంటున్న అపర్ణ మాటలుపూర్తి కానేలేదు. తడి యిసకలో వడివడిగా అడుగువేస్తూ అతడు కదిలిపోయాడు. ఇక కన్పించనంత దూరం వెళ్ళిపోతాడా అన్న అతని వేగం చూసి అపర్ణ కాలు వణికింది. ఆ కదలికకు చిన్నతనం నుండి పెంచుకున్న ఆశలాటి ఇసుక రేణువులతో కూర్చిన పిచ్చుక గూడు కూలిపోయింది. అతను వెళ్ళిన వైపే నిర్నిమేష దృక్కులతో చూస్తున్న అపర్ణ కంటి నుండి జారిన కన్నీటి చుక్కలు కూలిన పిచ్చుకగూటిపై పడి ఆ తడిలో కలిసిపోయాయి!!! ●

# చెల్లాయికి ప్రేమతో... 2

'పి. ఎస్.'

చెల్లీ!

నేను వ్రాసిన ఉత్తరానికి వెంటనే జవాబు వ్రాసినందుకు చాలా ఆశ్చర్యపోయాను. నీలో మార్పు వస్తోందన్నమాట. నీ వంట్లో కులాసాగా లేదనీ, మందు తింటూన్నాననీ, డాక్టరు బిల్లులు ఎక్కువగా అవుతున్నాయనీ వ్రాశావు. ఉత్తరమంతా జబ్బుల గొడవతోనే నింపావు. నీ ఉత్తరం పూర్తిగా చదివాక నాకు తట్టిన విషయమేమిటంటే, ఆహారం తీసుకునే విషయంలో నీకు గల నిర్లక్ష్యంవల్లనే నీకు నీరసం, నొప్పువంటి లక్షణాలు రావడం అని.

నీకు మందులిస్తున్న డాక్టర్లకన్న నేనెక్కువ తెలివిగలదాన్నని చెప్పబోనుగానీ ఏ కంప్లైంట్ అయినా డాక్టరుకి చెప్పబోయేముందు మనని మనం ప్రశ్నించుకోవలసిన అంశాలు కొన్ని ఉంటాయి. మనం వేళకి ఆహారం తీసుకుంటున్నామా, లేదా! మన ఆహారంలో పోషక పదార్థాలన్నీ సమపాళంలో ఉంటున్నాయా లేదా! మనకి తగినంత పనీ విశ్రాంతీ ఉన్నాయా, లేవా? పనికన్న విశ్రాంతిగానీ, విశ్రాంతికన్న పనిగానీ ఎక్కువగా ఉన్నాయా? ఇలాంటి విషయాలు మనని మనం ప్రశ్నించుకుని మన ఆరోగ్యాన్ని మనం అదుపులో పెట్టుకోడానికి అవకాశం లేకపోలేదు. శరీరాన్ని ఎక్కువగా మందులకి అలవాటు పడనీయడం మంచిది కాదేమో అనుకుంటాను. పెద్ద పెద్ద జబ్బులు, అంటు వ్యాధులు మొదలైనవాటి విషయంకాదు నేననేది. నీరసం, ఆయాసం, దడ వంటి చిన్న చిన్న కంప్లైంట్స్‌మాట. నీకు నీరసంగా ఉంటోందీ అంటే, నీకు అవసరమైనంత ఆహారం నువ్వు తీసుకోడం లేదేమో. అవసరమైనంత అంటే 'ఎక్కువ' అనికాదు. 'బలమైన' అని అర్థం. నువ్వు గృహిణివి. నీకు అనేక బాధ్యతలు, పనులు ఉంటాయి. ఆఫీసులో మగవాళ్ళు ఎంత పని చేస్తారో, ఇంట్లో గృహిణికి అంత కెక్కువే పని ఉంటుంది. అంచేత పిల్లల ఆహారం గూర్చి, ఆయనని గూర్చి ఎంత శ్రద్ధ తీసుకుంటావో, నిన్ను గూర్చికూడా నువ్వు అంత శ్రద్ధ తీసుకుని తీరాలి. పిల్లలకు కొసరి కొసరి వాళ్ళు పారేసేటంత కూర వేసి, చివరకు నువ్వు కూర వేసుకోకుండా భోజనం చేయడం నేను చూశాను గనుక ఇలా వ్రాయవలసి వచ్చింది. అసలు భోజనంలోనికి కూరలు, పప్పులు కూడా ఒక ప్లాన్ ప్రకారం చేయడం అలవాటు కావాలి. అన్ని రకాల కూరలు తినడం అలవాటు కావాలి. నీకు పప్పుతప్ప కూరలు సయించేవికావు. పచ్చడిలో కారం బాగా ఉండాలి. ఇలా నీ రుచులు ఉండేవి. వారంలో నాలుగు రోజులు బంగాళాదుంపలు, రెండు రోజులు పొట్లకాయలు ఒకరోజు పొరకాయా వండుతావు. నీకు ఆ మూడే యిష్టం. "తోటకూర, చుక్కకూరా ఏమిటి గడ్డి?" అంటాడు మీ ఆయన. మీ పిల్లలకి నువ్వు కూరలు తినడం చిన్నతనంలో నేర్పవు. దానివలన చాలా నష్టాలున్నాయి తల్లీ. వారానికి **ఒకరోజైనా** ఆకుకూర తినాలి అని **ఒక నియమం** పెట్టుకోరాదా? అలాగే అన్ని రకాల **కూరలూ** తినడం, వాటిని 'విటమిన్ వాల్యూ' పోకుండా వండడం నేర్చుకోవాలి. వీలైనంతవరకూ డాక్టరు బిల్లులు **తగ్గించుకోడం** శ్రేయస్కరం. అసలు నీకు మందు తినడమంటే అదొక గొప్ప విషయంగా ఉంటుందేమో అనుకుంటా. నీకేకాదు కొంతమందికంతే. రోజూ ఒక గ్లాసెడు పాలు త్రాగడం కష్టం. చేదుమాత్రలు మింగడం, గొంతుకి అడ్డం పడుతూన్నాసరే కాప్సూల్స్ వేసుకోడం బాగా ఉంటుంది. అంచేత శరీరానికి అవసరమైన పోషక పదార్థాలను ఆహారంద్వారా శరీరానికి సరఫరా చేయాలిగానీ, మందుల ద్వారా కాదంటే నువ్వు నవ్వకూడదు. ఆరోగ్యాన్ని చాలా జాగ్రత్తగా కాపాడుకోవాలి. సాయంత్రంవేళ అలా షికారుకి వెళ్ళాలంటే రిక్షా కావాలనకూడదు. కొంచెం నడక కూడా కావాలి. మన అమ్మ, అమ్మమ్మకి వున్న బలం మనకి లేదంటావేం, ఎందుకు లేదో వూహించలేవా? వాళ్ళు శరీరానికి తగ్గ పరిశ్రమా యిచ్చేవారు, దానికి తగ్గ ఆహారమూ తీసుకునేవారు. స్టయిల్‌గా కొంచెం తిని లేచేవారుకాదు.

ఏదైనా జబ్బుచేస్తే డాక్టర్‌ని చూడడం అవసరం. చాలా అవసరం కూడా. అయితే మనని మనం జాగ్రత్తగా చూసుకుంటూ, సహజంగా ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ, కర్మవశాత్తూ జబ్బులువస్తే మందు తినాలిగానీ, చిటికీమాటికీకాదు. ఈ మందుల 'మానియా' ఈ రోజుల్లో చాలామందికి ఉందిలే. ఒక్క మందుల 'మానియా'నేకాదు. జబ్బులను గురించి గంటల కొద్దీ చెప్పే 'మానియా' కూడా ఎక్కువైంది. నన్ను 'ఆధునిక భావాలు లేవు నీకు' అని నువ్వు వెక్కిరించినా ఫరవాలేదు. వీలైనంతలో ఆరోగ్యంగా, హుషారుగా, ఉత్సాహంగా గృహిణివుంటే ఆ ఇల్లు కళకళలాడుతుంది. వంట పని నీ చేతులోదే గనుక మీ ఇంట్లో వాళ్ళని ఆరోగ్యంగావుంచే బాధ్యతకూడా నీదే. అప్పుడే మీ యిల్లు 'స్వీట్‌హోం'అవుతుంది. నీ డాక్టరు బిల్లులు తగ్గుతాయి. ఆ డబ్బు పొదుపు చేసుకుని పట్టుచీరె కొంటావో, బ్యాంకులో నిలవే చేస్తావో మరి నీ యిష్టం. నీ ఆరోగ్యం సంగతి వెంటనే వ్రాయడం మరువకు.

నీ

'అక్క'

(పైవారం మరొకటి:)

సీరియల్

# కరుణ



కొండముది శ్రీరామచంద్రమూర్తి

### జరిగిన కథ

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోబాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్దచేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథను జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు. కరుణ—ప్రసన్నలకు వివాహ మవుతుంది మన్మథ కూడా పై చదువులు చదవటానికి నిశ్చయించుకుంటాడు. కరుణ, మన్మథ, వీరభద్రం. బి. ఏ. లో చేరటానికి వాల్తేరు వెళ్తారు. వీరికి ప్రొఫెసర్ నీలకంఠం దగ్గర సీటు సంపాదించగలుగుతాడు మన్మథ. ప్రసన్న ఉద్యోగ ప్రయత్న సఫలమవుతుంది. పెడదారి పట్టిన వీరభద్రాన్నివార్పటానికి మన్మథ చేసిన ప్రయత్నం విఫలమవుతుంది. చలపతి నుంచి వేరుపడ్డ జమదగ్ని కుటుంబం విశ్వనాథం కోరికపై ఆయన యింట్లో ఉండటానికి అంగీకరిస్తారు. తన ప్రయత్నాన్ని విఫలంచేసిన మన్మథపై ప్రతీకారాన్ని తీర్చుకోడానికి సింహాద్రి అవకాశం కోసం ఎదురుచూస్తుంటాడు.

## 23

వర్షాకాలం వెనక్కు తగ్గి చలికాలం ముందుకు వచ్చినా, ప్రసన్న స్వగ్రామం విడిచి వాల్తేరుకు వెళ్లడం పడలేదు. కరుణ కళ్లల్లో మెదల్తోంది. ప్రక్క గట్టిగా ప్రక్కటెముకలకు గుచ్చుకుంటున్నని. పెదిమలు పగిలి, అనుభవహీనములై కూడా, ఉపగూహనానంతర దంతక్షతమ్ములన్నట్లు వాడి కూడా అందముగానే కన్పిస్తున్నాయి. కాలేజీలకు క్రిస్మస్ సెలవులిచ్చారు. వరి పొలాలు గర్భిణీ స్త్రీల నడకలను జ్ఞప్తికి తెస్తున్నాయి. కరుణ ఇంటికి సెలవుల్లో రానని విశ్వనాథానికి ఉత్తరం రాసింది. ప్రసన్నకు ముప్పైనైన మూడు వాక్యాల ఉత్తరం.

"పరుగుపందెం నేర్చుకొన్న కాలంతో పోటీపడ్డ యవ్వన జీవితం వెనకబడుతోంది.

ఎదురుచూసి, ఎదురుచూసి ఎర్రబారిన కళ్లు అంతర్దృష్టి నలవర్చుకొంటున్నాయి. నాలిగల బ్రహ్మచర్యం మీ ఉద్యోగానికి, మగడుగల ఒంటరి జీవితం నా చదువుకూ, దోహదక్రియ లవుతున్నాయని, మనం సంతోషిద్దాం."

ప్రసన్న ఇహ ఉండలేకపోయాడు. స్త్రీ తానై తాను మనస్సు తెల్పినపుడు, అందునా స్వకీయ ముచ్చట పడినప్పుడు కాదని వోర్మి వహించే మగవాని మగటిమ సహించవలసింది కాదు. అతను దోషుడే కాదు దయాహీనుడు కూడా అని ప్రసన్నకు బాగా తెలుసు. ఆ కారణంచేత ఇహ నెంత మాత్రం ఆలస్యం చేయకుండా విశాఖకు బయల్దేరుదా మనుకున్నాడు. ప్రిన్సిపాల్ సుబ్బిరెడ్డితో తనకు కనీసం ఒక వారం పాటయినా వూరు వదిలిపెట్టి వెళ్లడానికి పర్మిషన్ కావాలన్నాడు. సుబ్బిరెడ్డి సెలవెందుకో గ్రహించి, నిర్మలంగా నవ్వుతూ "గ్రహించాను లెవయ్యా!— భార్య దగ్గరకు వెళ్తున్నానని చెప్పరాదూ?" అన్నాడు. ఆ వ్యంగ్యానికి ప్రసన్న కూడా నవ్వాడు. శారదాంబకు ప్రసన్న విశాఖకు వెళ్లడం బొత్తిగా ఇష్టం లేకపోయింది. 'ఆడపిల్ల సెలవుల్లో అయినా ఇంటికి రాకుండా ఆ చదువు లేమిటే?' అన్నది విశ్వనాథంతో ఒకటికి రెండుసార్లు. విశ్వనాథం మొదట మొదట జవాబు చెప్పలేదు. చివరకు తప్పనిసరి అయినప్పుడు "చదువుకని పంపాం. ఆ చదువు ఆసాంతం నిర్విఘ్నంగా పూర్తయ్యేట్లు చూసుకోవడం దాని విధి" అన్నాడు.

శారదాంబ మనస్సు చివుక్కుమన్నది. జమదగ్నితో చెవుదామంటే, ఆయన మంచంలో నుంచి లేవకుండా ఉన్నాడు.

అక్కడికే శారదాంబ తన అయిష్టత తను వ్యక్తపరచనే వ్యక్తపరచింది. "కోడలుపిల్లను చూడాలని నాకూ ఎంతో మనసుగా ఉంది!" అన్నది అన్యాపదేశంగా.

అర్థం గ్రహించినట్లుగా అన్నాడు ప్రసన్న. "నువ్వూ రామ్మా, వెళ్దాం."

"ఈ ఇల్లంతా ఎవరికి అప్పగించి రాన్రా! కోడలుపిల్లే ఇక్కడికి వస్తే బావుణ్ణు!"

"వస్తుంది లేమ్మా!"

అంతకన్నా ప్రసన్న ఎక్కువగా చెప్పలేదు. పనున్నట్లుగా ప్రక్క గదిలోకి వెళ్ళిపోయాడు. శారదాంబ చిన్నబోయింది. కొడుకుచేత పరాభవింప బడినట్టు భావించుకొంది.

ప్రసన్నను అక్కడ జమదగ్ని పలకరించాడు. "నాన్నా! మంచంలోనుండి లేవలేని అవిటి బ్రతుకు అయిపోయింది. ఇట్లా దగ్గరకు రా తండ్రీ!"

ప్రసన్న తండ్రి దగ్గరకు వెళ్ళి, మంచంమీద, తండ్రి ప్రక్కనే కూచుని, ఆయనమీద ప్రేమగా చెయ్యి వేసి "ఏమిటి నాన్నగారూ?" అని అడిగాడు.

"ఏం లేదు నాయనా! విశాఖపట్నం వెళ్లదల్చుకొంటున్నావుట! వీరభద్రం ఎట్లా ఉన్నాడో కనుక్కు వస్తావుకదూ?"

ప్రసన్నకు ఆశ్చర్యమైంది. ఆ తండ్రి

మనస్సు అర్థంకాలేదు. "పెద్దబిడ్డ మన్మథ అక్కడ ఉండగా, కోడలు కరుణ అక్కడ ఉండగా, వీరభద్రం విషయం కనుక్కో మంటా డేమిటి అనిపించింది. మనసులో ఉంచుకోలేక ఆ ప్రశ్నను పైకే అడిగేశాడు. జమదగ్ని నవ్వాడు. ఆ నవ్వులో జీవనతత్త్వం తెలుసుకొన్న గర్వం దాగి ఉంది. "పిచ్చి తండ్రీ !" ఆయన అన్నాడు. "నీకు నే నున్నాను, నేను కాకపోతే విశ్వనాథం ! పెద్దవాడు మన్మథకు చలపతి ఉన్నాడు ! నేనూ అని నడుం గట్టేవాళ్లెవరీ వీరభద్రానికి ? — మనం వదిలేస్తే అది తెగిన గాలిపటం అవుతుంది. పట్టుకుని ముత్యపుచిప్పలో దాచుకుంటే రత్నమవుతుంది."

ప్రసన్నకు జమదగ్ని మనసు అర్థమై, ఆయన వ్యక్తిత్వం అర్థమై ఆయన ఎంత గొప్పవాడో తెలిసింది. ఆయనతో అట్లాగేనని, వాకిట్లోకి వచ్చేసరికి, శారదాంబ వెనుకనుంచి పిల్చి చెప్పింది. "మళ్లీ ఆలస్యమైపోతుంది. ఈ ఇంట్లో దాని సంగతి ఒకళ్లకు పట్టలేదు. వెళ్లి, నీ చెల్లెల్ని పిల్చుకురా. ఆ అత్తగారికి ఇప్పటి మంచీ అడుగులకు మడుగు లెందుకు ?"

చీకటిపడుతూ పడుతూ ఉండగా ప్రసన్న గోవిందమ్మ ఇంటికి వెళ్లాడు. తలుపుకేసి చూస్తే తాళం వేయబడి ఉంది. ప్రసన్నకు అనుమానం వేసింది. ఇదమిద్ధమని చెప్పలేని అనుమానం. ప్రక్కనున్నవారిని అడిగాడు. వాళ్లు చెప్పిన విషయం మరింత బాధాకరమైంది.

గోవిందమ్మ కాని, వీరభద్రం కాని, ప్లీడరుతో సంప్రదించకపోవడం చేతా, కోర్టులో కనీసం స్వయంగా హాజరై వాదన చేసుకోని కారణంచేతా, వారిమీద తేబడిన సమస్తమైన బాకీలకూ ఏక్స్‌పార్టీ డిక్రీలు ఇవ్వబడ్డాయి. ఇల్లు కాస్తా వేలంలో కొట్టేశారు. మొహం చెల్లక గోవిందమ్మ వెళ్లి సత్రంలో తలదాచుకొంది. గోవిందమ్మతో పాటు కళ్యాణి కూడా వెళ్లింది.

వాళ్లు చెప్పిన గుర్తులు ప్రకారం, ఆ సత్రం వెతుక్కుంటూ ప్రసన్న బయల్దేరాడు. పెద్దగా వెతక నక్కర లేకుండానే. ఆ సత్రం తెలిసింది. తీరా వెళ్లి చూస్తే వోమూల గదిలో చిరిగిపోయిన చాప మీద గోవిందమ్మ, ఆమెకు కాళ్లు వొత్తుతూ కళ్యాణి కనిపించారు.

ప్రసన్నకు హృదయం నీరైపోయింది. ఓడలు బండ్లవుతాయన్న దానికి వారికన్న మంచి ఉదాహరణం దొరకదనిపించింది. వెళ్లి వోదార్చి, "గోవిందమ్మగారూ! మా ఇంటికి రండి. మేం మీకు పరాయివాళ్లం కాదు." అన్నాడు.

"మీరే పరాయి చోట ఉంటున్నప్పుడు నేను మీకు భారం కాదా నాయనా ? ఇదిగో, మీ చెల్లెల్ని మాత్రం తీసుకెళ్లు. నా బాధలు నా కెటూ తప్పవు. ఈ పిల్ల మొండిపట్టేమిటో తెలీదు. తనూ బాధలు పడుతూ నావెంట ఉంటున్నది. పిచ్చిపిల్ల ! తీసుకుపో నాయనా !"

ప్రసన్న కళ్యాణివేపు చూశాడు. గోవిం



ఉమ్మ పరిస్థితి అర్థం చేసుకున్నాడు. మెల్లగా, జాలిగా అన్నాడు. "నేను వాల్తేరు వెడుతున్నాను. అక్కడ వీర భద్రాన్ని కలుసుకుంటాను. అతన్నిక్కడకు తీసుకువచ్చే పూచీ నాదీ!"

గోవిందమ్మ నిరాశగా అన్నది : "అదేమి ఆశ్చర్యమో నాయనా! వాడు రాసిన ఒకటి రెండు ఉత్తరాలు తప్ప, మేము రాసిన ఉత్తరాలు వాడికి చేరుతున్నట్లే లేదు. తప్పకుండా నువ్వు వాణ్ని తీసుకురా వెంటబెట్టుకుని!"

"కాని దానికి, ఒకటే షరుతు. మీరు నావెంట, మా యింటికి రావాలి."

"మనసులో ఉన్న అనుమానం చెప్పాను కదుటయ్యా ?"

"మాకులేని అనుమానం మీకెందుకు గోవిందమ్మగారూ! మా కుటుంబంలో ఒక సభ్యులుగా మీరూ ఉందురు గాని. నాన్నగారి ఆరోగ్యమే బావుండి, మీ వ్యవహారాలు చూసేఉన్నట్లయితే, ఈ పరిస్థితి దాపురించేదే కాదు."

"అంతా కర్మ నాయనా!"

గోవిందమ్మకు లేవక తప్పిందికాదు. గోవిందమ్మతోపాటు కళ్యాణి.

ఉత్సుకత ఆపుకోలేక, దారిలో చెల్లెల్ని రహస్యంగా అడిగాడు. "అదేమిటే? అట్లా చేశావ్ ?—వెళ్లిన దానివి వెళ్లి నట్లే ఉండిపోయావ్ ?"

"రాలేకపోయా నన్నయ్యా!" కళ్యాణి సన్నగా అన్నది. "సుఖంలో కాదు, బాధ ల్లోనే కదా, బంధుత్వాలు, సేవ, విలువ మనకు తెలిసేది ? ఏ బంధువులకు చూపించడానికని నన్ను ఆవిడ తీసుక వెళ్లారో, ఆ బంధువులు, వ్యవహారాలు తల్లక్రిందులు కావడం చూసి తప్పు కున్నారు. నన్ను కూడా అట్లాగే చెయ్య మంటావా ?"

ఇంటికి వచ్చిం తర్వాత, శారదాంబ, కూడా పల్లెత్తుమాట అనకుండా, వియ్యపు రాలిని ఆహ్వానించింది. కౌగలించుకుని, కన్నీరు పెట్టింది. జమదగ్ని ఆమెకు ఏ లోపమూ అక్కడ జరుగదని హామీ నిచ్చాడు. విశ్వనాథం కేవలం తటస్థుడు. నాలుగైదు రోజా లయేసరికి, ఇంట్లో ఖర్చు పెరగడం చూసి, శారదాంబ, కొడు కుతో మంతనాలు సాగించక తప్పలేదు.

"ఇంట్లోకి కావలసిన సరుకులు ముందు తీసుకువచ్చి పడేస్తాను, ఇహ వచ్చే సంవత్సరం నా చదువంటారా ?—నందో రాజా భవిష్యతి. ఇంటికొచ్చిన వాళ్లకి ఇంత పెట్టి, మనం ఇంత తినాలికదా ?—"

శారదాంబ జవాబు చెప్పకుండా లోపలకు వెళ్లిపోయింది.

మర్నాడు ప్రసన్న విశాఖపట్నం వెళ్తా డనగా, విశ్వనాథం అతనితో అన్నాడు "చలపతిని కూడా ఒకసారి చూసి రాకూ పోయినావా ? మన్మధకు ఏవన్నా చెబుతా డేమో!"

"నిజమే! రేపు ప్రొద్దున వెళ్తాను."

ప్రసన్న చలపతి యింటికి వెళ్లేసరికి ఆ ఇల్లు తాళం వేయబడి ఉంది. "ఈ ఇల్లు కూడా కోర్టువారు జప్తు చేసు కున్నారా ?" అనిపించి, తన వూహకు తనకే నవ్వుకొన్నాడు. "చలపతికేం అప్పు లున్నాయి గనుక ?" అని తనను తాను సముదాయించుకున్నాడు.

కొంచెంసేపు నిలబడి, ప్రక్క ఇంటి వాళ్లను ఎంక్వయిరీ చేశాడు. వాళ్లలో కొందరు ప్రసన్నను గుర్తుపట్టి, "ఎంత మనస్పర్థలు వస్తే మాత్రం, మీరూ మీరూ ఒకటే కదా, ఆ ముసలాయన్ని అట్లా వదిలిపెట్టి వెళ్తారుటయ్యా ?" అని అడిగారు. ప్రసన్న దగ్గర సమాధానం సిద్ధంగా లేదు.

"ఎక్కడకు వెళ్లాడూ ?" అన్నాడు తన ప్రశ్నను రిపీట్ చేస్తూ.

"ఏమో మరి! మాతోనూ చెప్పలేదు. పొలాలు కౌలు కిచ్చేశాట్ట! 'నే నిక్కడ బాదరబందీ అంతా వదిలించేసుకుంటున్నాను' అన్నాడు వోసారి మాతో! ఏమో అను కున్నాం. మాకు అర్థంకాలేదు. కొన్ని రోజులు ఒక్కడూ అన్నం వండుకోడం బద్ధకంవేసి, పళ్లు తిని కాలక్షేపం చేశాడు. కీళ్ల నొప్పులు విపరీతమైనప్పు డల్లా, ఆ మంచంలో చూసేవాళ్లు నా అన్నవాళ్లు లేక అట్లాగే మూల్గుతూ పడుకొనేవాడు. అందుకనే ఈ బాదరబందీ వద్దనుకుని, పొలాలన్నీ కౌలు కిచ్చేశాడు. ఇల్లు తాళం పెట్టేసి, వో పొద్దుటి పూట, చెప్పా పెట్టకుండా లేచి చక్కా పోయాడు."

ప్రసన్న వెనక్కు తిరిగి వచ్చేసి, శార దాంబతో ఆ సంగతి చెప్పాడు. ఆమె



నో క్షణం ఆలోచించి అన్నది. "తీర్థ యాత్రలకు పోయి ఉంటాడు."

"అయితే పొలాలన్నీ కౌలుకు ఎందుకు ఇచ్చేశా డంటావ్ ?" జమదగ్ని ఎదురు ప్రశ్న వేశాడు.

"ఆఁ! చేసుకోలేక. కాశీ, ప్రయాగ, హరిద్వార్ ఇటు ఉత్తరదేశం చూసుకుని, రామేశ్వరం దాకా దక్షిణదేశం వెళ్ళి రావా లంటే నో సంవత్సరమైనా పట్టదుటండీ! అందుకనే కౌలుకిచ్చే ఉంటాడు."

"ఏమోనే ! మనం అనుకొనేటంత భోళా మనిషి కాదు."

మొత్తంమీద చలపతి ఎక్కడకు వెళ్ళిందీ, నిర్ధారణ చేసుకోలేకపోయారు. ప్రసన్న వూరికి వెళ్ళేరోజున మన్మథకు ఇష్టమని గవ్వలూ, చేగోడీలూ చేసి పొట్లాం కట్టి ఇచ్చింది. శారదాంబ. "నాయనా ! అబ్బాయిని తీసుకుని వచ్చి కళ్లకు చూపించే భారం నీది" అన్నది గోవిందమ్మ ఏడుస్తూ.

"అమ్మాయిని జాగర్తగా చదువుకో మన్నానని చెప్పు ! ప్రొఫెసరుగార్ని అడిగానని చెప్పు. జాగర్తగా వెళ్ళిరా." అన్నాడు విశ్వనాథం.

జమదగ్ని కొడుకును దగ్గరకు తీసుకుని, "పెళ్ళయిం తర్వాత భార్య ఒక చోటా, భర్త ఎరో చోటా ఉండడం మంచిదికాదు. అమ్మాయిని కనీసం శెలవు కాలం సెలవులకైనా ఇంటికి రమ్మను" అన్నాడు.

ప్రసన్న అందరు చెప్పినదానికీ తల వూపి వూరికి బయల్దేరాడు.

* * *

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంధ్ర వారోత్సవాలు జరిగినంత అందంగా, సందడిగా మరెక్కడా జరగవు. విద్యార్థులు నాటకాలు వేస్తారు. నాటకాల్లో వేషాలు వేసి, రక్తి కట్టించలేక పోయినవార్ని అక్కడి కక్కడే గేలి చేస్తారు. పూర్ణ కుంభాలతో కవి 'సింహ' అనూ, కవి 'పాదుషా' అనూ, కవి 'ఎంపరర్' అనూ అప్పోనిస్తారు. ఉపన్యాసం బాగో లేక పోతే సగంలో ఉండగానే చాలు ఖాళీ చేస్తారు. ఆ యేడు ఆంధ్ర వారోత్స వాలూ, అంతర్ కళాశాలల యువ జనోత్స వమూ వెంబడే గగ్ కట్టమంచి రామ్మ వాల పోటీలూ ఒక్కసారే వచ్చాయి. లింగారెడ్డి విహారంలో జరుగుతోంది. దీనికి తోడు ఆలిండియా సైన్సు కమిటీ హిస్టరీ డిపార్టుమెంటువారు 'టాయెన్బీ' ని

పెద్ద యెత్తున ఆహ్వానించడానికి, సన్నాహాలు పూర్తి చేసుకుంటున్నారు. దూరం నుంచి చూసేవారికి యూనివర్సిటీ ఒక పెళ్లి విడిదిలా కన్పిస్తున్నది. ప్రతి విద్యార్థి మొహంలోనూ పెళ్లి కళ తాండవిస్తున్నది. ప్రొఫెసర్ నీలకంఠం గారికి నాటకాలన్నా, నాటకాలు వేయించడమన్నా ప్రత్యేకమైన శ్రద్ధాసక్తులు ఉన్న కారణం చేత, వైస్ ఛాన్సలరుగారు ఆయనకు నాటకాలు వేయించే భారం వదిలిపెట్టారు. అది నాటకశాఖలో పాఠాలు చెప్పుకొంటున్న ఒకానొక కురంగేశ్వరరావుకు మనసుకు కష్టమైనా ఏమీ చేయలేక, నీలకంఠంగారికి అసిస్టెంటు గిరీకి ఒప్పుకున్నాడు. అయినా మనసులో ఉన్న కష్టం పోగొట్టుకోటానికి, నాటక రచనా, ప్రయోగ కౌశల్య పారంగతులైన సుశిక్షితులైన విద్యార్థుల నెవర్నీ కూడా, రంగస్థలం మీద రంగు పూసుకోడానికి లేకుండా కట్టడి చేశాడు. తన కట్టడిని అమలు జరుపడానికి, క్రొత్తగా చేరి తన మనసు నాకట్టుకొన్న వీరభద్రానికి అప్పగించాడు. ప్రొఫెసర్ నీలకంఠంగారికి పరిస్థితుల నర్థం చేసుకుని ప్రవర్తించడం క్రొత్తగా నేర్చుకోవలసిన విద్య కాదు. విద్యార్థులు ముందుకు రానప్పుడు, తనే క్లాసులకు నోటీసు పంపి, మన్మథనూ, మరికొందరు విద్యార్థులనూ, రజని, కరుణ, సబిత మొదలైన కొందరు విద్యార్థినులనూ సమావేశపర్చి, "ఇది నా గౌరవానికి సంబంధించిన సమస్య. అనేకమంది ఆహ్వానితుల సమక్షంలో వేయవలసిన ప్రదర్శనం. 'అహల్యా శాపవిమోచనం.' మిమ్మల్ని నమ్ముకొని ఇందులోకి దిగుతున్నాను." అన్నాడు. కరుణను అహల్యగా వేయవలసిందని అడిగాడు.

"నాకు నటన చేతకాదు." అన్నది కరుణ, ప్రొఫెసరుగారికి పునఃక్లేశం కల్గించవలసి వస్తున్నదన్న విచారంతో. "దానికేముంది తల్లీ ! నేర్పడానికి నే నిక్కడ ఉన్నాను కదా ? అయినా, ఈ జీవన రంగస్థలంమీద అద్భుతంగా ఎన్ని పాత్రలు మనం నటిస్తున్న వాళ్లము, జాస్పేవు రంగు పూసుకుని ఆ ఆర్టిఫిషియల్ స్టేజీమీద నటించలేమూ ?" అన్నారు ప్రొఫెసరుగారు.

ఇంద్రుని పాత్ర, మన్మథకు ఇవ్వబడింది. రజని, సబిత, అహల్యకు చెలికత్తెలుగా నటించాలి. గౌతమమునిగా మరో విద్యార్థి నిర్ణయించబడ్డాడు.

రిహార్సల్స్ సమయంలో మన్మథ, కరుణకు ఎంతో ధైర్యం చెప్పవలసి వచ్చింది. అతనికి కూడా మనసులో బెరుకుగానే ఉన్నది. నాటకం వేయడానికి కాక, నాటకంలో తను తీసుకున్న పాత్ర స్థితిని గురించి. కరుణకు మరీ యిబ్బందిగా ఉంది. అయినా తప్పని పరిస్థితి. ఒక రితో చెప్పుకోలేని పరిస్థితి. ఒకటి, రెండుసార్లు నాటకం మానివేద్దామా అనుకొన్నది కరుణ. రజని, సబితలు అందుకు ఒప్పుకోలేదు.

"నువ్విలా బిడియపడతా వెందుకమ్మా ? సబితచేత వేయించడంలేదూ వేషం ? నాటకం వేయడం తప్పు కాదు తల్లీ! నాటక రచనను తపస్సుతోనూ, నాటకశాలనూ యజ్ఞ వాటికతోనూ, దేవాలయంతోనూ పోల్చారు మనవాళ్లు." అట్లా నీలకంఠంగారు మాట్లాడుతున్నప్పుడు కరుణకు మార్గాంతరం లేకపోయింది. అహల్యతో ఇంద్రుని ప్రణయ సన్నివేశాలు, మన్మథ నటించలేక బాధపడి ఒకటి, రెండుసార్లు మానుకొందామని ప్రయత్నం చేస్తే, "ప్రొఫెషనల్ యాక్టర్ కన్నా బాగా, నేచురల్‌గా యాక్ట్ చేస్తున్నావ్ ! అంత నిరాశ పడతావేం ?" అని ప్రోత్సహించేవారు ప్రొఫెసర్‌గారు మన్మథకు నటించక తప్పలేదు. మనసులో పిరికితనం పోయే మార్గంలేదు.

నాటకం రిహార్సల్స్ ముమ్మరంగా సాగిపోతున్న సందర్భంలో ఒకసారి మన్మథ, కరుణను అడిగాడు. "నాకు ఇది చాల ఎబ్బెట్టుగా ఉంది. నీకు ?"

కరుణ వెంటనే జవాబు చెప్పింది. "నాకు అసలు యిష్టంలేదు."

ఈ సమయంలోనే ప్రసన్న దగ్గర నుంచి, తను వాల్తేరు వస్తున్నట్లు ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం పట్టుకొని కరుణ, మన్మథ దగ్గరకు పరుగెత్తుకు వచ్చింది. కంగారు కంగారుగా అడిగింది, నుదుట పట్టిన చెమట బిందువులనైనా తుడుచుకోకుండా. "ఆయన వస్తున్నారట ! ఇప్పు డెట్లా ?"

ఇది ఎంతటి సున్నితమైన వ్యవహారమో మన్మథ అర్థం చేసుకొన్నాడు. అయినా యీ సమయంలో కరుణకు అధైర్యం చెప్పకూడ దనుకొని, "మరీ మంచిది. రానీ ! నాడూ చూచి సంతోషిస్తాడు." అన్నాడు. కరుణ కళ్లలో నీళ్లు నిండాయి.

"రాకరాక ఆయన వస్తున్నారు. ఈ సమయంలో నే నిక్కడ నాటకాలు వేసుకుంటూ, స్టేజీ ఎక్కి గంతులేస్తుంటే ఏం బావుంటుంది ? నే నిక్కడ చేస్తున్న నిర్వాహం ఇదేనని ఆయన అపార్థం చేసుకోరూ ?"

"భయపడకు కరుణా ! బహుశః వాడు వచ్చేసరికి, ఈ నాటకాల గొడవే అయిపోతుందేమో !"

కరుణకు మనసులో మాత్రం భయం భయంగానే ఉన్నది. నటనలో పరధ్యానం నటిస్తున్నది. మాటలో పొరపాట్లు దొర్లుతున్నవి.

ఒకరోజు సాయంకాలం సబిత, రజని, కరుణ సాయంకాలం షికారుకు స్కాండల్ పాయింటు దగ్గరకు వెళ్లారు. కరుణ వెళ్లిందని కాదు, స్నేహితురాండ్రు బలవంతంగా ఆమెను లాక్కొని తీసుకు వెళ్లారు.

"మా బావగా రొస్తున్నారంటే, అంత పరధ్యానం నటిస్తున్నావేమిటే ?" రజని, కరుణ బుగ్గలు పుణికింది.

"ఎడబాటులోని విరహం ఇంత తియ్యనిదటే ?" సబిత ఎత్తి పొడిచింది.

కరుణ వాళ్లిద్దరివేపూ జాలిగా చూసింది. "అది కాదు. అదికాదు. మీకు తెలీదు" అన్నది.

"మాకు తెలిదనే అంటున్నాం. తెలిసినదానవు ప్రక్కన ఉన్నావు కనుక, చెప్పమనే అంటున్నాం."

తనలో తను బాధపడడం కన్నా స్నేహిత్కు

# రేపటి పెయింట్ ఈరోజే మీకు అందజేస్తున్నాము

# డ్యూలక్స్ కొత్త ఎక్రెలిక్ ప్లాస్టిక్ ఎమల్షన్

వర్ణప్రదాయకంగా ప్లాస్టిక్ ఎమల్షన్ పెయింట్స్‌లో పెద్ద పురోభివృద్ధి

ఈనాడు కొనదగు వేపూర్వే రంగులలోకెల్లా "డ్యూలక్స్" ఎక్రెలిక్ ఎమల్షన్ ఎందువల్ల శ్రేష్ఠమైనది? ఎక్రెలిక్ కోపాలిమర్ సంప్రదాయంగా వస్తున్న హోమోపాలిమర్ ఎమల్షన్ పెయింట్లు అన్నింటికంటే. ఎక్రెలిక్ కోపాలిమర్ కలిగివున్న పెయింటు ఎక్కువకాలం మనగలదని వివిధ పరిశోధనలలో తేలింది. "డ్యూలక్స్" ఎక్రెలిక్ ఎమల్షన్ పెయింటు పూసిన వాటిని ఎన్నిసార్లయినా కడిగి శుభ్రము చేయవచ్చును. పైగా లోపలి భాగాలలోనైనా, వెలుపలి భాగాలలోనైనా ఈ పెయింట్ పూసిన చోట అది వన్నె లీనుతూ చాలాకాలం కొత్తగా వుంటుంది. అంతా ఒకే రకంగా కంటికింపుగా రంగు వుండాలంటే 'డ్యూలక్స్' ఎక్రెలిక్ ఎమల్షన్ వాడండి. ఇది అన్నింటికంటె ఎక్కువ స్థలమునకు వస్తుంది కనుక చౌకగా గిట్టుబాటు అవుతుంది.

ఉత్పత్తిదారులు:
ది అల్కలీ అండ్ కెమికల్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్
ఐ.సి.ఐ. (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్.
కలకత్తా, బొంబాయి, ఢిల్లీ.

ఇండియాలో ఐ.సి.ఐ. [illegible] పరిశోధన ఫలితం.




DULUX
ACRYLIC EMULSION

## కరుణ

రాండ్రకు తన మనసు విప్పి చెపితే కొంత ఆరాటం తగ్గుతుందనుకొన్నది కరుణ. చెప్పబోయింది. ఇంతలో రజని అడ్డువచ్చి 'స్కాండల్ పాయింట్' దగ్గర్నుంచి తమను చూచి తమవేపే వస్తున్న వాళ్లను చూపిస్తూ "అదుగో వాళ్లు!" అన్నది.

కరుణ తల అటు త్రిప్పింది. ముందుగా సింహాద్రి అప్పలస్వామి కనిపించాడు. నల్లని మొహం. లావుపాటి శరీరం. మెల్లగా నడుస్తూ వస్తున్నాడు. అతని ప్రక్కనే వీరభద్రం.

రజని భయం భయంగా, మిగిలిన వాళ్లతో "వెళ్లిపోదాం పదండి" అన్నది.

"ఎందుకూ వెళ్లిపోవడం ?" సబిత అడ్డుకొంది. "భయపడ్డకొద్దీ వెంట తరుముతుంటారు. ఆనాడు మన్మథ సమయానికి రాకపోతే, నేనే తెగించి ఉండేదాన్ని. ఏం భయంలేదు. వాళ్లను రానీండి"

వాళ్లిద్దరూ వీళ్ల ముగ్గుర్నీ చూసి నమస్కారం చేశారు. కరుణకు, ఆమె స్నేహితురాండ్రకూ నమస్కారం చేయక తప్పలేదు కుశల ప్రశ్నలు ముగిసిం తర్వాత, దగ్గరగా ఉన్న ఇసుకలో కూచుని, వీరభద్రమే అన్నాడు. "మా స్నేహితుణ్ణి చూశారా, ఎంత మారిపోయినాడో ?"

అప్పలస్వామి అందుకున్నాడు. "ఆ వంఘటనకు నే నెంతో సిగ్గుపడుతున్నానండి. జ్ఞాపకం వచ్చినప్పుడల్లా తేళ్లు కుట్టినట్టవుతోంది ఉత్త పశువులా ప్రవర్తించాను."

రజని, ఆశ్చర్యంతో అతనివేపు చూసింది. సింహాద్రి రజనివేపు పరిశీలనగా చూస్తూ "ఆరోజున కాదు, ఇవ్వాళ వేడుకొంటున్నాను నిజమైన క్షమాపణ. క్షమించరూ ?" అన్నాడు దీనంగా.

రజని ఏదో అందామనుకొన్నది. సబిత, వాళ్లతో తనకేమీ పని యున్నట్టు పిచ్చిక గూళు కట్టుతూ, వాటిని క్రింద పడదోసి, మరల కొత్తవి కట్టుకుంటోంది. సముద్రంలో నుండి వో పెద్ద అల వచ్చి ఆమె కూచున్న చోటి నంతా తడపడానికి ప్రయత్నంచేసి విఫలమై తిరిగి వడిపోతోంది. నీళ్లు ముక్కలై పారిపోతున్నాయి. ఉండి ఉండి వీస్తున్న గాలికి, ఆమె నీలి కుంతలాలు నాట్యం చేస్తున్నాయి. వీరభద్రం మాటలే విన్పిస్తున్నాయి. "ఏమిటి చెలా య్! నువ్వు మన్మథ కలిసి నాటకంలో వేస్తున్నావా ? హాస్టల్లో ఎవరో అనుకొంటూంటే విన్నాను"

సింహాద్రి యాదాలాపంగా అన్నటు అన్నాడు. "అవును భద్రం! కరుణగారు, అహల్య పాత్రా, మన్మథ ఇంద్రుడూ వేస్తున్నారట! రియలీ ఇట్-ఈజ్ ఎ బ్యూటిఫుల్ కాంబినేషన్!"

వీరభద్రం హితబోధ చేయడం మొదలు పెట్టాడు. "నాకు ఇష్టంలేదుసుమీ! మనం ఇక్కడకు ఎందుకు వచ్చాం చెప్పండి ? చదువుకోవడానికి అవునా ? అయినప్పుడు నాటకాలు వేయడం, అందునా స్వంత బావ గారితో తుచ్చుదునమ్మా అని స్టేజి ఎక్కడం —మనకు లాయకీకాదు సుమండీ! ఆపైన మీ యిష్టం! మీరేం మైనర్లు కాదుగా, ఒహళ మాటలు వినడానికి!!"

కరుణకు అటువంటి అపాత్రుని వద్ద నుండి పాఠాలు వినవలసి రావడం ఎంతో బాధ కల్గించింది. చివాలున లేచి నిలబడి "మీ సలహాకు మెనీ మెనీ థ్యాంక్స్! మళ్లీ కలుసుకుందాం రండర్రా!" అంటూ స్నేహితురాండ్రను తీసుకుని గృహోన్ముఖురాలైంది

ఆమె నడుస్తున్నదన్నమాటే కాని ఆమెలో కోటికోటి సందేహాల విషనాగులు పడగలు విప్పుతున్నాయి. లోకమంతా తనను చూసి పరిహసించబోతున్నట్టుగా ఒక భ్రాంతి. సబిత ఆమెను పలకరించబోయింది. కరుణ ఆమెను విసిరికొట్టింది. రజని ఆమెను బ్రతిమలాడ బోయింది. ఎవరినీ రానివ్వకుండా తలుపులు వేసుకొంది కరుణ.

(సశేషం)

గాబీబ్రయర్

# హాలీవుడ్ ప్రణయాలు

నాతో ఒక అతి అందమైయిన ఫ్రెంచి నటీమణి ఎప్పుడో అన్నది—

"గాబీ! బర్ట్‌లాంకాస్టర్‌ని కలవటం నా జీవితాశయం! ఈ సహాయం చేసిపెడ్తావా?"

మే మిద్దరం అప్పుడు హాలీవుడ్‌లోని 'షాతో మార్మోం' హోటల్లో ఉంటున్నాము.

పావుగంటలో నీకు లాంకాస్టర్ టెలిఫోన్ చేస్తాడు" అని జవాబు ఇచ్చాను. ఆమె ఆశ్చర్యాన్నిచూస్తే నాకు నవ్వొచ్చింది. నామాటమీద ఆమెకి మొదట్లో నమ్మకం కలగలేదనుకుంటాను. కాని నిముషాలలో బర్ట్ లాంకాస్టర్ ఫోన్ చేశాడు. సాయంత్రం ఒక 'డ్రింక్'కి రమ్మని పిలిచాడు.

ఇందులో నా గొప్ప ఏమీ లేదులెండి. అదే హోటల్లో రీటా హేవర్త్ భర్త జేమ్స్‌హిల్ ఉండేవాడు అతనూ బర్ట్‌లాంకాస్టర్ ఒక ప్రొడక్షన్ కంపెనీలో వాటాదార్లు. రోజూ లాంకాస్టర్ అక్కడికి వస్తూ ఉండేవాడు. ఈవిధంగా వారితోనాకు పరిచయం అయింది.



ఎలిజబెత టేలర్

ఆ సాయంత్రం నా స్నేహితురాలిని బర్ట్ లాంకాస్టర్‌వద్దకి తీసుకువెళ్లాను. ఆమె హడావుడి ఇంతా అంతాకాదు. అప్పుడే లాంకాస్టర్‌ని బుట్టలో వేసుకున్నట్లే అనుకుంటోందనుకుంటాను!

బర్ట్‌లాంకాస్టర్ అక్కడ మాకోసం కాచుకుని ఉన్నాడు అతనితోబాటు అతని భార్య, అయిదుగురు పిల్లలూ కూడా ఉన్నారు. శ్రీమతి లాంకాస్టర్ లావుగా ఉంటుంది. చాలా గడుసు మనిషి.

"చూశావుగా,మాకు అయిదుగురు పిల్లలు. ఇంకా పుడ్తారు! బర్ట్ చాలా జాగ్రత్త మనిషి. ఇంతమంది పిల్లలతో పిచ్చివనేదయినాచేస్తే ఎంత గొడవ అవుతుందో, ఎంత కర్చవుతుందో అతనికి పూర్తిగా తెలుసు. ఫ్రాన్సులోకన్నా అమెరికాలో విడాకుల పరిహారాలు ఎక్కువ తెలుసుగా?" అంది నా మిత్రురాలితో చిరునవ్వు వలకబోస్తూ!

ఇక నా సంగతంటారా? నా ప్రయోజనం కోసం ఒక మనిషిని బుట్టలో వేసుకుందామని నేను ప్రయత్నించిన దొకసారే— ఆ ఒక సారీ నేనే చాలా బాధలకి లోనవవలసి వచ్చింది.

నేను సమ్మోహింప ప్రయత్నించిన వ్యక్తి మిల్టన్ బెర్లె—అమెరికాలో కెల్లా ప్రసిద్ధి పొందిన హాస్యనటుడు....

ప్రతివారం కనీసం 4 కోట్ల అమెరికన్లు మిల్టన్‌బెర్లెని టెలివిషన్‌మీద చూసి విరగబడి నవ్వుతారు.

అతన్ని జాక్‌వార్నర్ పార్టీ ఒకదానిలో కలిశాను. 'అతను తలుచుకుంటే నిన్ను బాగా పయికి తీసుకురాగల'డని నా మిత్రవర్గం అంతా అన్నది. నేను అప్పుడే టెలివిషన్‌లో ప్రవేశించాను. మిల్టన్ నా నటన చూసి ఆమోదంతోనే మాట్లాడాడు. నా గదికి వచ్చి నాభవిష్యత్తు గురించి ఏదయినా సూచనలు ఇవ్వవలసిందని కోరాను.

ఒక రాత్రి రానే వచ్చాడు. రాగానే

గదిలోని డ్రాయర్లూ, బీరువాలూ వెతి కాడు. మంచంకింద కుర్చీలకింద, కప్పు మీద— అన్నిచోటా వెతికాడు. నేను చకితు రాలనయిచూస్తూ ఉండిపోయాను.

"ఏంలేదు! మైక్రోఫోను ఎక్కడయినా దాచారేమోనని చూస్తున్నాను. నా శత్రు వులు ఎప్పుడూ నన్ను బోల్తాకొట్టిద్దామని చూస్తారు!" అని నాకు విడమరచి చెప్పాడు చివరికి.

చెప్పిన తర్వాత ఒక కుర్చీలో కూల బడి హఠాత్తుగా ఏడవడం ప్రారంభిం చాడు! "నా కష్టాలు నీకేం తెలుసు? ఎక్కడ చూసినా పగవారే.....టెలివిషన్ ప్రోగామ్‌లు జరుగుతున్నప్పుడు కొందరు గూఢ చారులు వచ్చి ఏవో అల్లరి మొదలుపెడ్తారు! నేను ఎంత దురదృష్టశాలిని!" అనివాపోయాడు.

ఇది జరిగిన తర్వాత మరికొన్నిసారులు నా గదికి వచ్చాడు. వచ్చినప్పుడల్లా ఏడ్చే వాడు. "నాకు తెలిసినవారందరిలో నమ్మ దగిన వ్యక్తివి నువ్వే!" అనేవాడు. కొంత కాలం తర్వాత నాకు మళ్ళీ కనిపించకుండా మాయమయిపోయాడు!

ఈ సంఘటనతో నాకు ఒక విషయం తెలిసి వచ్చింది. హాలీవుడ్‌లో వ్యాపారాన్నీ, విలాసాన్నీ కలపటం కష్టం.....

ఇప్పుడు మీకు ఒక కథ చెప్తాను. అది కట్టుకథలాగే ఉంటుంది. కాని నిజంగా జరిగింది. ఈకథకి నాయిక నా స్నేహితురాలు పిర్సీ సెంక్లేర్, ఒక అందమయిన ఫ్రెంచి గాయకురాలు.

ఒకనాడు ఎవరో ఆమె తలుపుతట్టారు. ఒక హోటల్ పనిమనిషి ఆమె చేతికి ఒక చిన్న అట్టపెట్టె ఇచ్చి, "ఇది మీకు ఇవ్వమన్నారమ్మా! 'మిగతా' కింద ఉంది. వెళ్ళి చూడండి" అన్నాడు.

అట్టపెట్టెలో చిన్న బంగారు తాళం చెవి ఉంది. 'మిగతా' ఏమిటా అని పిర్సీ కిందకి పరిగెత్తుకు వెళ్ళింది. 'మిగతా' ఒక పెద్ద, తెల్లని కాడిలాక్ కన్వర్టిబ్‌ల్ కారు! దీనిని ఎవరో 'అభిమాని' పంపారుట. పిర్సీకి మూర్ఛవచ్చినంత పనయింది!

ప్రేమ ఇంత ఘనంగా పరిణమించటం ఎప్పుడోకాని అయేపనికాదు. ఇది అతి అపు రూపమయిన సంఘటన.

అమెరికాలో 'ఇన్‌కంటాక్స్' చాలా బాధా కరంగా ఉంటుంది. ఖరీదయిన బహుమతులు పుట్టాలంటే ఇన్కంటాక్స్ పన్ను విధిస్తారు. [illegible]

అందుకనే అమెరికాలో పెళ్ళి చేసు కుంటేకాని అమ్మాయిలకి గొప్ప బహు మతులు త్వరపడి ఇవ్వరు మగవారు— సాధారణంగా. పన్నుల బాధలో తప్పించుకొన టానికి తాత్కాలిక వివాహాలు చేసుకునే ప్రవృ త్తులు కూడా లేకపోలేదు. నాకు వయసు మీరిన మగవారంతా చేసిన వివాహాలని నేను గనక స్వీకరించి ఉంటే ఈ పాటికి ఎంతో డబ్బు గడించి ఉండేదాన్ని.

కొందరు పట్టే దాంబికులు. మైక్‌టాడ్

(49 వ పేజీ చూడండి)

(గత సంచిక తరువాయి)

కథక్ నృత్యాన్నే హిందీ సినిమాలలో యిటీవలి వరకూ చూపిస్తుండేవారు. అంటే క్లబ్ డాన్సులూ, ట్విస్టులూ అవంబడు ఆంగిక వికారాలకు గిరాకీ హెచ్చక పూర్వం. స్వచ్ఛమైన కథక్‌లకి సుదూరంగా ఉన్నా తెలుగు సినిమాలలో చాలా నాట్యాలు యీ పునాది మీదనే ఉంటాయి. ముద్రలు అభినయం మీద అంతగా ఆధారపడకుండా రక్తికట్టించే విధానం యీ నృత్యంలో అంత క్లిష్టంగా ఉండుటవలన అతి స్వల్పమైన శ్రేణిని ఆక్రమించుకొంటుంది, "స్వర్ణన్న" లో "అందగాడా" నృత్యంతోబాటు రెండవ శ్రేణికి చెందినవి "బికారి రాముడు" లో "రంగేళి లీలర నా రాజా", "టాక్సీ రాముడు" లో "మనలో మాట మమా", "పదండి ముందుకు" లో "ముసినవ్వు వెలుగులోనా" మొదలైనవి. వీటిలో సంగీతం ఆ కోవకు చెందినట్లే ఉన్నా నాట్యం మాత్రం అంతంత మాత్రంగానే ఉంటుంది. ఇక అధమశ్రేణికి చెందినవి ఎన్నో ఉన్నాయి.

అని "కాలాపాని" లోనూ, "కహాఁ తుమ్ క్యా క్యా ఖరీదోగే" అని "సాధనా" లోను ఉన్న ముజ్రా నృత్యాలు మంచివి. "జహారాణి" చిత్రంలో సినతైన ఖవాలీకి ఒక సిపరంత "ముజ్రా" కలిపి ఒక కొత్త రకాన్ని చూపించ ప్రయత్నించినా, యిది రక్తికట్టలేదనే చెప్పాలి.

కథాకళి నృత్యమార్గం కేవలం నృత్య నాటకాలకే ఉపయోగించబడుతుంది. "మాయాబజార్" లో 'మోహిని బస్మాసుర' నృత్యం యిటువంటి పద్ధతికి మెచ్చుకో

# మన చిత్రాలలో నృత్యాలు

—వి. ఎ. కె. రంగారావు

మార్పులతోనే యీ కథక్‌ను ప్రజాను రంజకముగా మలచవచ్చును.

"అనార్కలి" లో "రాజశేఖరా" నృత్యం శాస్త్రీయమైన కథక్ పద్ధతికి, (మొదటి పాటలో భరతనాట్య పద్ధతిని ముద్రలు ఉన్నా) అతి చేరువగా ఉన్నది. ఇంత చక్కటి ఉదాహరణ దీని వెనువెంటనే చెప్పుకోవాలంటే మరొకటి లేదు. "బందిపోటు"లో కథక్ వంటిది ఒక నృత్యం ప్రవేశపెట్టబడినది కాని నిజమైన కథక్‌కీ దీనికీ కనీసం ముఖపరిచయమైనా లేదు.

తమిళ చిత్రాలలో ఎప్పుడో గాని యీ పద్ధతిని అవలంబించరు. "విప్లవవీరుడు" చిత్రంలో కమల చేసిన రెండు నృత్యాలూ యీ కోవకు చెందినవీ, ఉత్తమమైనవీ. ఈ సరళికే "నాచ్‌ఘర్" చిత్రంలో 'దిల్ తుఝ్‌కో దియాథా దిల్‌దార్ మాన్‌కే", "కఠ్ పుత్లీ" చిత్రంలో "హాయే తూహి గయా మోహే భూల్‌కే" పాటలకు, "పైగామ్" లో వైజయంతిమాల "మై క్యూఁనా నాచూఁ" పాటకూ చేసిన నృత్యాలు హిందీ చిత్రాలలో కథక్‌కి ఉత్తమోత్తమమైన ఉదాహరణలు.

కథక్ నృత్యానికి వేలు విడచిన చుట్టమే "ముజ్రా" జాతి నృత్యం. వీటినే సినిమా పరిభాషలో ఖరోశీడాన్సు అంటారు కాని సరియైన పదం "ముజ్రాయే". "ఎం. ఎల్. ఏ" చిత్రంలో "వందనాలు చేయాలి" అన్నది ఇటువంటి వాటిలో ప్రధమ

హిందీ చిత్రాలలో యివి సరిపాటే. "నజర్ లాగే సైయాఁ తోరే బంగ్లేపర్"



'శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణు కథ'లో జమున,

దగ్గ ముచ్చటవక. నాట్యం శాస్త్రబద్ధమై ఉన్నా, ఆహార్యం, ముఖానికి వేసే రంగులూ కథకళి విధానంలో వేయరు. అలా వేస్తే ఆ నృత్యమార్గంతో ఏమాత్రము పరిచయులేని ఆంధ్ర ప్రేక్షకులకు అది వింతగా కనబడుతుంది. "భక్త రామదాసు" చిత్రంలో పిల్లలు చేసే పాటలో ఒక భాగం యీ పద్ధతినే ఉన్నది. శాస్త్రీయంగా కథాకళికి ఒకే ఒక మెట్టు క్రిందుగా ఉన్నది "ఆట్టమ్ తుళ్ళల్." ఇది రమ్యమైనదీ, జానపద మార్గానికి కొంత దగ్గరగా ఉన్నదీ, కాని యింత వరకువూ యే తెలుగు చిత్రంలోనూ ఉపయోగింపబడలేదు.

జానపద నృత్యాలలో యావద్భారత ఖ్యాతి నార్జించిన ఒకే ఒక నృత్యం పంజాబు దేశపు "భాంగ్డా", "జాగ్తేరహో" చిత్రంలో మనోహర్ దీపక్ అధ్వర్యాన బ్రహ్మాండమైన ఉద్వేగంతో హిందీ చిత్రసీమలో ప్రధమంగా ప్రవేశించిన యీ 'భాంగ్డా', క్రమేణా అన్ని భాషల చిత్రాలలోనూ జొరబడి యీనాటికి పూర్తిగా సిరు కారిపోయింది. తెలుగు చిత్రాలలో కంటికి యింపుగా ఉన్న ఒకే ఉదాహరణ "కులగోత్రాలు" లోనిది. కంట గింపుగా ఉన్నవి "అనురాగం", "పదండి ముందుకు" "డాక్టర్ చక్రవర్తి" చిత్రాలలోనివి.

"కోలాటం" చాలా చిత్రాలలో యితర నృత్యరీతులతో కలిపి చూపించారు,

తీయని తెలుగుదనంతో తేనెలు చిందుతూ యీ కోలాటం ఆనాటి "పత్ని" లో 'చిరు నవ్వు మోముతో చెలువొందు నా స్వామి శ్రీకృష్ణు డేలరాడే" అనీ, యీనాటి "ఉయ్యాల జంపాల" లో "రుక్మిణమ్మా రుక్మిణమ్మా" అని కనబడినవి. "కుల గోత్రాలు" లో "రావయ్యా మాయింటికి", "వాగ్దానం" లో "మా కిట్టయ్య పుట్టిన దినము" పాటలలో కోలాటం చూడ టానికి ఆహ్లాదకరంగా ఉన్నా గౌత్త రాహుల కోలాటాన్ని, మహారాష్ట్రుల జాన పద సంగీత సరళుల్ని, ఆంధ్రుల గొల్లం బిందుని మోహనంగా మేళవించగా ఉద్భ వించినవే.

మహారాష్ట్ర దేశంలో సామాన్య ప్రజకు అతి సన్నిహితంగా వుండే నృత్య విధానం "లావణి". మరాటీ చిత్రాలలో ఎక్కువ గానూ, హిందీ చిత్రాలలో కూడ కొన్ని మార్లు దర్శన మిచ్చినదనే చెప్పాలి. "వరుడు కావాలి" లో రాగిణి చేసిన 'సాగి రావోయి బంగారు మామ", "రాజనందిని" చిత్రంలో కృష్ణకుమారి చేసిన "నిన్నే నిన్నే" అన్నది యీ కోవకు చెందినవే. ఆ దేశ స్థులచేత లావణి అనిపించుకోకపోయినా మనకు—లాగానే అనిపిస్తాయి. హిందీ చిత్రాలలో యీనాటికీ చెప్పుకొంటారు, పదిహేనేళ్ల క్రితం "దాగ్" లో ఉషా కిరణ్ చేసిన లావణి. కొన్నేళ్ల తరువాత కొంత హాస్యాన్ని జోడించి "పెహ్లా ఝలక్" లో వైజయంతిమాల "జీహాజి జీహాజీ" అంటూ చూపిందీ లావణీ. తెలుగు చిత్రా లలో యింకొంత విరివిగా యీ పద్ధతి ఉపయోగింప దగ్గది.

గోవాకు చెందిన "మాండో", సింహ ళానికి చెందిన 'బైలా', సంగీతంలో, నాట్యంలో చాల పోలికలు కలిగి ఉంటాయి. అవసరాన్నిబట్టి హిందీ చిత్రాలలో యీ సంగీతాన్ని, నృత్యాన్ని వాడుకొన్నారు అన్ని విధాలా నిరుపమానమైన "జాల్" చిత్రంలో "చోరీ చోరీ మెరీ గలీ ఆనాహై బురా" అంటూ గీతాబాలీ, దేవానంద్ చేసినది మాండో. "ఆవాజ్" చిత్రంలో "ధితంగ్ ధితంగ్ బోలే" పాటకు "బైలా—మాండో" వరసను మాత్రం ఉపయోగించుకొన్నారు. తెలుగు చిత్రాలలో కూడ అదేపని జరి గింది, "ప్రజాశక్తి" లో "బంగరు మావయ్య" పాటలోనూ, "వరుడు కావాలి" చిత్రంలో "వన్నెల చిన్నారి' పాటలోను.

అర్థంలేని గంతులనూ, అడ్డులేని శృంగారాన్ని మేళవించి చూపాలనుకొన్న చాలమందికి శరణ్యమైన ఆటవిక నృత్యాలు అన్ని భాషల చిత్రాలలోనూ, అనాదిగా ఉంటున్నవనే చెప్పాలి. వీటికి విశిష్ట మైన స్థానాన్ని ఏర్పరచినది హిందీ చిత్ర రంగంలో సంగీత దర్శకుడు సి. రామ చంద్ర, గీతకారులు పండిట్ సంతోషి, రాజేంద్రకృష్ణ, నృత్య దర్శకులు సూర్య కుమార్ కృష్ణకుమార్ సోదరులు. వీరి సంగీత, సాహిత్య, నృత్య సంపదలతోనే "సర్గమ్, ఖజ్యా, సౌదాగర్, ఆల్బేలా" చిత్రాలు అఖండ విజయాన్ని సాధించినవి. తెలుగు చిత్రాలలో వాటితో సరితూగేవి లేవు. కాని "ప్రేమ" చిత్ర ములో భానుమతి, సూర్యకాంతం చేసేది, "భాగ్యలక్ష్మి"లో కమలాకొట్నిస్ చేసిన "తిన్నెమీది సిన్నోడ", "సిపాయి కూతురు"లో, "లంబాడి లగిజిగి" సరదా గానే ఉన్నవని చెప్పవచ్చు.

("పై వారం —యే కోవకూ చెందనివి.")

---

# హాలీవుడ్ ప్రణయాలు

(47 వ పేజీ తరువాయి)

ఈ రకం మనిషే. తలుచుకున్నప్పుడల్లా నాకు నవ్వొస్తుంది. అసలు ఇతను ఒక పెద్ద ప్రొడ్యూసర్ కావటానికీ, ఎలిజ బెత్ టేలర్‌ని పెళ్లాడటానికి నేనే ఒక విధంగా కారకురాలినేమో!

అప్పటికి మైక్ చేతిలో చిల్లిగవ్వ ఉండేదికాదు. నన్ను తరచు భోజనానికి తీసుకు పోతూ ఉండేవాడుకాని ప్రతిచోటా అప్పు పెట్టేవాడు. కొంతకాలం తర్వాత, నన్ను ఒక చిన్నఇంటికి తీసుకువెళ్లి ఒక 'వస్తువు'ని చూపించాడు. అది ఒక చిన్న పెట్టె. నలుగురు అబ్బాయిలు దానితో ఏవేవో పరి శోధనలు కాబోలు చేస్తున్నారు. ఆపెట్టెకి ఒక కిటికీ ఉంది. నన్ను ఆ కిటికీలోకి ప్రత్యే కంగా తయారు చేసిన కళ్లజోడులో చూడ మని అడిగాడు. ఏమిటోలే, అనుకుని చూశాను

నా కళ్లని నేనే నమ్మలేకపోయాను! అది మైక్‌టాడ్ తయారు చేయిస్తున్న "టాడ్— ఏ—వో" ఫిలిం నమూనా. దాని స్వచ్ఛతనీ, ఆకర్షణనీచూసి ఆశ్చర్యపోయాను.

"ఇది నా స్వంత సాధనం. దానికి ఎవ రయినా పెట్టుబడి పెట్టేట్లయితే కోటీ శ్వరుడిని అయిపోగలను!" అన్నాడు మైక్ నాతో.

ఇది జరిగిన కొన్ని వారాలకి నేను 20— సెంచురీ అధిపతి 'పపా' జోషెంక్‌ని కలి శాను. అతనితో ఈ విషయం చెప్పాను.

"మైక్‌ని నన్నొచ్చి కలుసుకోమను' అన్నాడు జో.

మైక్‌కి రాశాను. నా కళ్ల ఎదుటే జోషెంక్ అతనికి 30 లక్షల డాలర్ల చెక్కు ఇవ్వగా చూశాను.....

కాని మైక్ వెర్రివాడు. డబ్బంతా విచ్చలవిడిగా కర్చుచేసేవాడు. ఉన్నవి చాల అప్పుచేసి నగలుకొని భార్య ఎలిజబెత్ టేల ర్‌కి ఇచ్చేవాడు. వాటిని దొంగలు ఎక్కడ కాజేస్తారో అని 'బాడీగార్డ్' లని ఏర్పాటు చేసేవాడు. (సశేషం)

ప్రిన్స్ కుమారి.ఇ



# ముఖచిత్ర సుందరి శతచిత్ర సుందరి!



ఖులాసాగా ఒకవాడు...



భార్యాభర్తలు
కులగోత్రాలు
'పునర్జన్మ'
చిత్రాలు ఆమెకు
ప్రత్యేకమైన
వ్యక్తిత్వాన్నిచ్చాయి!

# అభినేత్రి...

కాశీరాజు ప్రకాశం

## కృష్ణకుమారి...

'మహానటి'కి వుండవలసిన ఆర్భాటమూ హంగూ అట్టే లేకుండా, చిరునవ్వుల సోయగాల్ని చిలికిస్తూ అనతికాలంలోనే ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని సంతరించుకొన్న తెలుగు నటి కృష్ణకుమారి పేరు చెప్పగానే— వెంటనే భార్యాభర్తలు, కులగోత్రాలు, పునర్జన్మ, స్ఫురణకు వస్తాయి. కారణం — కుమారి కృష్ణకుమారికి తెలుగువారి హృదయాలలో ప్రత్యేకస్థానం లభించటానికి పై చిత్రాలే కారణం.

విశాలమైన సినిమా ప్రపంచంలో— అందునా తెలుగు సినిమాలో—తారలు అసంఖ్యాకులుగా వున్నప్పటికీ, పాతవారు కొందరు మరుగునపడిపోతున్నా, కొత్తవారు కొందరికి 'చేయూత' లభిస్తున్నా— కృష్ణకుమారి స్థానంమాత్రం నిశ్చలంగానే ఉండిపోయింది గత ఆరు సంవత్సరాలనుంచీ.

## నవ్వితే నవరత్నాలు

1951 లో 'నవ్వితే నవరత్నాలు' చిత్రంలో కృష్ణకుమారి ఒలికించిన నవ్వుల రత్నాలను ప్రేక్షకులు తొలిసారిగా చూడగలిగారు ఆమెను వెండితెరకు పరిచయం చేసింది కూడా యీ చిత్రమే. ఆ మరుక్షణమే కృష్ణకుమారి మహానటి, ఉజ్జ్వలతార అయి, మూడోనాటికి యధాస్థితికి రాలేదు ...... 1951 నుంచీ ఒక్కొక్క మెట్టు నెట్టుకొంటూ ప్రతి మెట్టునూ స్థిరపరచుకొంటూ, ప్రగతిపథంలో సాగిపోయిన ఈ నటికి, 'శాశ్వతమైన స్థానం' లభించటానికి కొంత కాలం పట్టినా, ఆస్థానం నిజంగానే 'శాశ్వతం' అయింది. మరునాటికి పెద్దవారయి, మూడోనాటికి మళ్లీ చిన్నవారయిపోయేచాలా మందితో పోల్చిచూస్తే, కృష్ణకుమారి నిజమైన 'ప్రగతి' నే సాధించిందని విజ్ఞులు అంగీకరించాలి.

## చిరస్మరణీయాలు:

తొలిరోజుల్లో ఆమె ధరించిన పాత్రల్లో చిరస్మరణీయమైనవి లేకపోలేదు. కాని అంతకంటే మంచి పాత్రలు వచ్చిన తరువాత పాతవాటిని మరిచిపోవటం సహజం. అందుకే పైన చెప్పినట్లు కృష్ణకుమారి పేరు చెప్పగానే మనకు 'భార్యాభర్తలు' చిత్రంలో శారద, 'పునర్జన్మ'లో రాధ విధిగా గుర్తుకొస్తారు. అల్లరి కుర్రాడికి అందమైన భార్యగా ఉండటం ఎంత కష్టమో 'భార్యాభర్తలు'లో శారద పాత్ర ధారిణి కృష్ణకుమారికి తెలియాలి అలాగే 'పునర్జన్మ'లో కూడా. లభించిన జీవితానికీ, ఆశించిన జీవితానికీ జరిగే సంఘర్షణను 'పునర్జన్మ'లో రాధగా కృష్ణకుమారి ప్రదర్శించిన తీరు నాటికీ నేటికీ చిరస్మరణీయమే! అలాగే, 'కానిస్టేబుల్ కూతురు' చిత్రం కూడా. ఈ చిత్రం విజయంతో నిమిత్తం లేకుండా, ఆ పాత్రను పరిశీలిస్తే, నిజంగా అది కృష్ణకుమారి జీవితంలో ఒక 'మైలురాయి' అని చెప్పితీరాలి.



అభినేత్రి...

## అరడజను చిత్రాల్లో....

ఈనాడామె అరడజనుకుపైగా చిత్రాల్లో నటిస్తోంది. అందులో ప్రత్యేకమైన, విశిష్టమైన పాత్రలు లేకపోలేదు. ఉదాహరణకు ప్రత్యగాత్మగారు నిర్మిస్తున్న 'చిలకా—గోరింక' చిత్రంలో ఉషగా నటిస్తోంది. శంకరరెడ్డిగారి 'రహస్యం' లో రాజ్యలక్ష్మి పాత్రను ధరిస్తోంది. అలాగే ఉదయ భాస్కర్ పిక్చర్స్, అంబికాపిక్చర్స్, అమరావతిచిత్రవారి 'పాదుకా పట్టాభిషేకం' (ఈ సంచిక ముఖచిత్రం అందులోనిదే) మొదలయిన చిత్రాలలో ఆమె పోషించే పాత్రలు, కృష్ణకుమారి వ్యక్తిత్వానికి కొత్త మెరుగులను దిద్దే అవకాశాలు లేకపోలేదు.

## రెండూ ఇష్టమే...

కృష్ణకుమారికి హైదరాబాద్‌తోనే ఎక్కువ సంబంధం వుందని కొందరు—ఎవరి మనస్సులోవారే—అనుకొనే యీ రోజుల్లో "అలాంటిదేమీలేదు. మనం కేవలం ఆర్టిస్టులమే. రెండు నగరాలు ఒకటే. ఎక్కడ పనివుంటే అక్కడి కెళతాం" అని ఆమె స్పష్టంగా చెపుతారు. నిజమేమరి! (ఆమె యీమధ్యనే హైదరాబాదులో యిల్లు కొన్నారట సుమా!)

## కథలకే అగ్రతాంబూలం

చిత్రాలను గురించి, వాటి విజయాలను గురించి ఆమెకు నిర్దుష్టమైన అభిప్రాయాలున్నాయి. "మంచి సినిమాకు కథ చాలా ముఖ్యం" అంటారు. ఆ తరువాత డైరెక్షన్. వీటికితోడు మంచి నటనకావాలి. అప్పుడే ఆ చిత్రం విజయవంతం అవుతుందంటారు.

## దీక్ష....

ఇంకా ముందుకు వెళ్లాలని, తన రంగంలో ఒక క్రొత్తదనానికి తామెగా

# కృష్ణకుమారి

తావివ్వాలని ఆమెఆశ. అందుకుతగిన కృషిని, దీక్షను ఏనాడో ఆరంభించింది. ఏ భావలో వచ్చినప్పటికీ పేరెన్నికగన్న ప్రతిచిత్రాన్ని ఆమె చూస్తుంది. "మై ఫెయిర్ లేడీ" ఎంతో బావుందంటూరు కృష్ణకుమారిగారు.

## 102 మైలు రాళ్లు

కృష్ణకుమారి, నటిగా, కళాకారిణిగా యింతవరకు తన అనంతయాత్రలో 102 మైలురాళ్లను దాటింది. ప్రతి చిత్రమూ సరాసరిన ఒక మైలురాయి. కొన్ని వాలు గేసి మెళ్లకు సమానమే అయినా, ఫర్లాంగు దూరం పోనివికూడా మరికొన్ని ఉండక పోవు. అందువల్లనే 'సరాసరి'!

కృష్ణకుమారి స్వతహాగా తెలివైన నటి. ఆమె అదృష్టంకొద్దీ కొందరు దర్శకులు విబంగా ఆమె ప్రతిభకు వన్నె తేవటమేగాక, ఆవన్నెనుకూడావెలుగులోకిదెచ్చారు.

వచ్చిన వన్నె మేలిమి బంగారు వన్నె. ఆ కళాకాంతులు సామాన్యమైనవికావు. అందువల్ల కృష్ణకుమారి ఇంకా ఎన్నో మైలురాళ్లను దాటవలసివుంది! గమ్యస్థానాన్ని 61 లోనే అందుకొన్నా, నటిగా కృష్ణకుమారి 'గమనం' శరవేగంతో బహుకాలం పరుగులు తీయవలసిందే! ●





'కన్నెమనసులు' తార సంధ్యారాణి.

## సంధ్యారాణి జన్మదినోత్సవం

గత పక్షంలో మదరాసు సినిమా రంగంలో జరిగిన ముఖ్య విశేషాల్లో కుమారి సంధ్యారాణి 'పుట్టిన రోజు' కూడా ఒకటి.

మార్చి 8 వ తేదీతో 18 సంవత్సరాలను నింపుకొంటూ, 19 వ సంవత్సరంలో అడుగిడుతున్న కుమారి సంధ్యారాణి తన జన్మ దినోత్సవాన్ని ఎంతో నిరాడంబరంగా జరుపుకొన్నది. తనకు శ్రేయోభిలాషులను కొన్న బహుకొద్దిమందిని ఆహ్వానించి, అందరి ఆశీస్సులను అందుకొంది.

సంధ్యారాణి మహానటి కాకపోవచ్చు. కాని, 'సినిమారంగం'లో ఒక స్థానాన్ని సంపాదించుకొన్నది. కొత్త తారల 'లేత మనసులు' చిత్రం ద్వారా వెండి తెరకు పరిచయం అయిన నటీ నటులలో సంధ్యా రాణి కూడా ఒకరు. బాబూ మూవీస్‌వారే నిర్మిస్తున్న 'కన్నె మనసులు' లో ఆమె యీనాడు ముఖ్య భూమికను ధరిస్తున్నది.

సంధ్యారాణి జన్మ దినోత్సవానికి హాజరయిన వారిలో పలువురు ఫిలిం కళాకారులు, ఆత్మీయులు వున్నారు. ●

# ఆంధ్రప్రదేశ్ అవార్డులు

ఆంధ్రపత్రిక వారపత్రిక మరికొన్ని గంటల్లో ముద్రణకు వెళ్లనున్న దశలో, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అవార్డుల వివరాలు మా కార్యాలయం చేరాయి.

జగపతి పిక్చర్సువారు నిర్మించిన "అంతస్తులు" చిత్రాన్ని 1965 లో విడుదలయిన తెలుగు చిత్రాలో కెల్లా ఉత్తమమైనదిగా నిర్ణయిస్తూ, మొదటి బహుమతి బంగారు నందిని యీ చిత్రానికి అందచేస్తున్నారు. రెండవ బహుమతి, వెండి నంది, ఎన్. ఏ. టి. వారు నిర్మించిన "శ్రీ కృష్ణపాండవీయం" చిత్రానికి ప్రకటించారు. అన్నపూర్ణావారు నిర్మించిన "ఆత్మ గౌరవం" చిత్రానికి మూడవ బహుమతి (కంచునంది)ని రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది.

# వింత తెలుగు

(10వ పేజీ తరువాయి)

చోట చేర్చి, ఒక్కొక్క విభక్తి అని పేరు పెట్టి, ఎనిమిది విభక్తులు చేశారు. కాని తెలుగులో అట్లా లేదే. నిజం చెప్పాలంటే తెలుగులో రెండే రెండు విభక్తులుండాలి! ప్రథమ, ద్వితీయలు అంతే. ఎల్లాగంటారా ? ఉదాహరణకి "రాముడు" అనే మాట తీసుకుందాం. ఇది ప్రథమా విభక్తి. ఈ మాటలోని చివరి అక్షరం "డు" మిగిలిన అన్ని విభక్తులలోనూ "ని" గా మారుతోంది. రాముని, రాముని గూర్చి, రామునిచే, రామునితో, రామునికై, రాముని వలన, రామునికంటె, రామునికి, రామునియొక్క, రామునిలో, రాముని యందు .....

సంస్కృతంలో అంటే ఒక్కొక్కమాట ఎనిమిది విధాలుగా మారింది గాని తెలుగులో అల్లా మారడం లేదుకదా, మరి పిడుగుకీ బియ్యానికీ ఒకటే మంత్రం అంటే ఎల్లాగా ?

ఇటుపైన అయినా తెలుగుభాషను అనుశాసించే (శాసించడం కాదు) పెద్దయ్యలూ, చిన్నయ్యలూ ఈ విషయాన్ని గుర్తుంచుకుంటే ఎంత బాగుంటుంది? ●

# తారాగణం గ్రహబలం



సినిమా తారలు నిలిచేది సినిమా రంగంలో. జాతకాలు జన్మించేది జోతిష్య శాస్త్రంలో. తారలు వెలిగేది ఆకాశంలో. సాంకేతిక నిపుణులపైనే గాక కొందరి ప్రముఖ తారలపై కూడా సినిమారంగం ఆధారపడి వుంది సినిమారంగం. అలాగే ఆకాశంలో సూర్యచంద్రులపైనే గాక తారల రూపంలో మనకు కనిపించే కుజ, బుధ, శని, శుక్రాది గ్రహాలపై కూడా జాతకాలు ఆధారపడి వుంటాయి.

గ్రహాలు వాటి స్థానములు మారినప్పుడు ప్రతి ప్రాణి యొక్క స్థానాలు, పరిస్థితులు మారుతాయట. కాని ఈకాలంలో జాతకాలు గురించి పట్టించుకోలేనివారు కూడా వుంటారేమో కాని సినిమా తారలు గురించి పట్టించుకోనివారు తక్కువ. సినిమా తారలకు వారి జాతకాలపై నమ్మకం ఎక్కువ. అంకెలకూడిక పేరులలో శోభల ఫలితం, జన్మ నక్షత్రబలం, పుట్టిన తేదీలు మొదలగు వాటితో జాతకాలు వ్రాయించి, పేర్లు మార్చుకొనే వారు లేక పోలేదు. వాళ్ళు పుట్టినప్పుడు తల్లి దండ్రులు పురోహితులచే లెక్కలు వేయించి. శాస్త్రయుక్తంగా పెట్టిన పేర్లు సినిమా రంగంలో పనికిరాక జ్యోతిష్యశాస్త్ర ప్రవీణులమని చెప్పుకు తిరిగే పెద్దల మాటలు నమ్మి అసలు పేర్లను మార్చుకొని, క్రొత్త పేర్లను పెట్టుకోవడం యీనాటి అలవాటు.

నటీనటులలోగాని, సాంకేతిక నిపుణులలో గాని అక్కడక్కడ కొంతవరకు అడుగుపెడుతున్న వారు లేకపోలేదు. గొప్పఅయినా వేషాలు వేసి, చిన్నచిత్రాలు సాధించే వాటి ప్రతిఫలంగా జోతిష్యశాస్త్ర పుస్తకాలు, తెలుగు, ఆంగ్లభాషలలో ఉన్న గ్రంథాలు కానిపించటం, వారికి జోతిష్యశాస్త్రం వచ్చినట్లు ఆ నిర్మాతలనో, దర్శకులనో ఒప్పించునట్లు జాలుగు మాటలు చెప్పి చెలామణి కావటం జరుగుతుంది. నిర్మాతల విషయం చెప్పనక్కరలేదు. ఒక ప్రక్క షూటింగ్ జరుగుతుంటుంది. ప్రొడక్షన్స్‌లో ఉన్న వారికి ఎవరికీ క్షణం తీరికలేని సమయమై ఉంటుంది. కాని ఎవరైనా జాతకం విషయం మాట్లాడితే స్టూడియోలో చెట్లక్రింద కుర్చీలు వేసుకొని శ్రద్ధగా చర్చ సాగించడం జరుగుతున్నాయి. ఇటువంటి ప్రయ్యావర్ణను ఆశ్రయించిన నటీనటులు, జోతిష్య శాస్త్రజ్ఞులు సినిమారంగంలో ఎక్కువ.

"అరచేతిలో శుక్రరేఖలా సాగిపోయింది మీ ధనార్జన రేఖ. అంతేనా! ఓహోహో! మీది చెయ్యి అటుండి? మీ చేతితో మట్టి పట్టుకుంటే బంగారం అవుతుంది. కామలాను పలుకుబడి, మీమాటకు విలువ, వాహన, గృహాది యోగం, అబ్బ, ఒక్కమాటలో చెప్పాలంటే ఫిలిం పరిశ్రమకు పునాది లాంటి వారుగా రేమిటి? కొద్దిరోజులు, ఎక్కువకాలం కూడా లేదు." అని చెప్పి ధనార్జన చేసే శాస్త్రజ్ఞులు పెరిగిపోయారు.

మంచిరోజున ఫిలిం కంపెనీ ప్రారంభించాలని, "పేరు బలానికి కంపెనీ పేరు మీ...ఎవరు ? ఆమె...రెండవ ఫామిలీ. ఆమె పేరుతో ప్రారంభిస్తే చెప్పాలా?" అని ఒకరు- "ఈరోజున షూటింగు ప్రారంభించండి. ఆరోజు అర్ధరాత్రి ఇన్ని గంటలకు రికార్డింగ్ ప్రారంభించండి" అని ఒక శాస్త్రజ్ఞు "చిత్రంపూర్తి అయిన తర్వాత ఫలానారోజున మనం అంతా కలసి ఆ ఏడుకొండల వెంకటరమణమూర్తికి అభిషేకం చేయిస్తే సరిపోతుంది." అని మరొక ప్రవీణుడు. "మీని ఏమి రోజాలండి? తక అంటే అలా సరిగట్టాలి. ఫలానారోజున మ్యాటినీతో ప్రారంభిస్తే కనీసం యీచిత్రంలో లక్షా యాభైవేలు అయినా మీకు రావాలి." అని ఒక పండితుడు మాటలు. ఇవన్నీ చిత్రం విడుదలయిన తరువాత తారుమారయేవి లేక పోలేదు. లేకపోవడమేమిటి? ఏ విధంగాను విజయవంతం కావు. విడుదలయే రోజు నుండి పై శాస్త్రజ్ఞులకు కాస్త కుస్తీ ప్రారంభమౌతుంది కొంతకాలం వరకు.

విచిత్రకాలుగా జాతకాలు చూపి, ముహూర్తాలు పెట్టి, అంకెలు చేసి, కూడి చిత్రాలకు పేరుపై పేరు మార్చినా అదృష్టం ఉండాలి. అదే సమయంలో మరో మంచి చిత్రం విడుదల కావాలి. మంచి కథ, సంగీతం, సాహిత్యం, చక్కటి సన్నివేశాలు, నీతి మొదలైనవి ఉండాలి. చిత్రం విజయవంతం కావాలనుకుంటే నిర్ణయించేది ప్రజలు. ప్రేక్షకులు. అంతేకాని జాతకాలు కావు.

ఉత్తమనటి కావాలని ఒకరు, పెద్ద బంగాళా కాక ఎక్కడైనా ఖాళీగా ఉన్న స్థలాలు, వాళ్ళు పుట్టిన గ్రామంలో చౌకగా వస్తే పొలాలు కొందామని కొందరు, కార్లకు ఆర్డర్లు యిద్దామని, నటుడిగా, నిర్మాతగా గాక, దర్శకుడుగా కావాలని కొందరు, ప్రభుత్వాధికారుల నుండి ఏ పంవత్సరంలో

బిరుదులు పొందేది, లక్షలకొద్దీ లక్షలు సంపాదించాలని కొందరు, కలకాలం కథానాయకుడిగానో, నాయికగానో ఉండాలని కొందరు. వీటికి జోతిష్య శాస్త్రజ్ఞులు అవసరం. వారి మాటలు చక్కగా పని చేస్తాంటాయి. ఈ ఆశలకు అంతెక్కడ? అదృష్టం కోసం ఎదురు చూస్తూ, వచ్చిన అదృష్టాన్ని నిలబెట్టుకోవడానికి గ్రహశాంతులు, పూజలు చేసేవారు మరికొందరు.

జోతిష్యం ఏమాత్రం తెలిసినా సినిమా రంగంలో భుక్తికి లోటుండదు. జోతిష్యం తెలిసిన ఏ సాధూ అయినా, స్వాములవార్లైనా, బాబా అయినా మదరాసు వస్తే వారిని దర్శించుకునే జనాభాలో సినిమావాళ్లు నూటికి తొంభైతొమ్మిది మంది వుంటారు. వాళ్ల దశలు మారిపోతాయని భయం, ఆ బాబా, స్వామి, సాధూలు మార్చి వేస్తారని ఆశ. సినిమా తారల దశా బలాలు ఒక్కొక్కప్పుడు దేదీప్యమానంగా వెలుగుతుంటాయి. అకస్మాత్తుగా ఆరిపోతుంటాయి. ఎన్నో లెక్కలు వేసి, రాసులు గుణించి, గణించినా జరిగే నిజాలకూ, తారాబలాలకు భేదాలు వుంటూనే వున్నాయి.

ఒక తారతో జోతిష్యుడు ఈరోజు, రేసులో మీకు యాభైవేలు వస్తాయన్నాడు. వెంటనే ఆ తార చేతితో అయిదు వేలు అందుకున్నాడు. ఆతార ఒక గుర్రం మీద పదివేలు పందెం కట్టింది. పందెంలో గుర్రం ఉన్నచోటు నుండి కదలలేదు. తారకు నీరసం వచ్చింది. అవసరానికి చేసిన అప్పు మిగిలింది. ఈరోజు వరకు అప్పు తీర్చలేక ఆతార బాధపడుతూనే వుంది. ఆ జోతిష్యుడు కనిపించలేదు.

ఒక తారకు ఆస్థి, పేరు కలకాలం నిలవాలని, తూర్పు ముఖంగా గృహావరణలో గుడి కట్టించమన్నాడు ఒక జోతిష్యుడు. అందంగా నిత్యధూప దీప నైవేద్యాలతో ఆరాధించేందుకు గుడి కట్టించి, దైవప్రతిష్ఠ జరిపింది. తన జాతక బలం ఉచ్ఛ స్థితిలో ఉందని, జాతక శాస్త్రజ్ఞుని మాటలు నమ్మి అవివేకంలో నిర్మించింది. ఆగుడితో పాటు గృహం కూడా దక్కని పరిస్థితి ఏర్పడింది. కాని ఆతార మంచితనమే యింతవరకు ఆపగలిగింది, అందుకే

# తారాగణం...

అంటారు పెద్దలు మంచిపనులు చేయడానికి జాతకాలు ముహూర్తాలు అడ్డేమిటి, అని,

మరికొంతమంది నటీనటులు నిర్మాతల నుండి డబ్బు తీసుకునేటప్పుడు రాహుకాల తిథి, నక్షత్రాలు చూడరు కాని, వాళ్ల దగ్గర అహర్నిశలూ పని చేసేవారికీ, వారు యివ్వవలసిన వారికో యివ్వాలంటే యీ రోజు శుక్రవారం అని మంగళవారమనీ, రాహుకాలమనీ తప్పించుకుంటారు. ఈ జాతకాలు వాళ్లకు ఉపయోగపడుతున్నాయో, లేవో కాని వాళ్ళు మాత్రం జాతకాలను యీ విధంగా వుపయోగించుకుంటున్నారు.

ఒక చిన్న నటుడు 'ఒక ప్రముఖ నటుని వీపు మీద ఉచ్ఛ జాతక సూచకమైన మచ్చ వుంది. అది నాకూ వుంది!', మరొక చిట్టి తార, 'ఒక అగ్రతార జుట్టులో సుడివుంది. అది నాకూ వుంది.' అనుకుంటూ ఆశతో అయిదారు సంవత్సరాలు మదరాసులో గడిపి యిటీవల మొన్ననే స్వగ్రామానికి వెళ్తూ రైలులో కనిపించారు.

ఒక బుల్లి తార 'ఆ అగ్రతారకు పన్ను మీద పన్ను ఉంది. అలాగే నాకూ ఉంది. నేనూ అంతటి తారనవుతాను. అంతటి శ్రీమంతురాలనవుతాను. అంత పెద్ద చదువు ఉన్న భర్త నాకూ దొరకాలి' అంటూ కలలు కంటున్న రోజుల్లోనే కారు ప్రమాదానికి గురి అయింది.

నిజానికి అదృష్టం అనేది కోరినా ఒక్కప్పుడు ఎవర్నీ వరించదు. దురదృష్టం అనేది మనం కోరకుండానే ఒకొక్కప్పుడు వరిస్తుంది. ఇవన్నీ కాచి, వడపోసిన వాళ్ళు కూడా జాతకాల కోసం తాపత్రయ పడటం హాస్యాస్పదం. సంపాదన ఎక్కువయే కొలదీ




జాతకాల పిచ్చి ఎక్కువ అవుతుంది. ఈజాతకాలు గురించి కొంతమంది తారలు ఎప్పుడూ ఇద్దరూ ముగ్గురు జోతిష్యుల్ని వెంట వేసుకు తిరుగుతారు.

ఒక తారకు తన జాతక ప్రకారం కారు నెంబరు ఉండాలి. మరొక నటుడికి కారు నెంబరు, ఇంటి నెంబరు న్యూమరాలజీ ప్రకారం ఒకటై ఉండాలి. చెప్పుకుంటే సిగ్గు. కారు నెంబరు, యింటి నెంబరు, ఫోన్ నెంబరు ఒకటై యుండాలి ఒక వర్తమాన తారకు. ఒక కాల్‌షీటు కాలం వృధా అవుతుందని నిర్మాతలు బాధపడినా, ఇతర సాంకేతిక బృందం యీతారతో ఏదైనా దృశ్యం చిత్రీకరించటానికి ఎదురు చూస్తున్నా రాహుకాలమని బయలుదేరని తారలున్నారు. బయలుదేరి స్టూడియోలకు వచ్చినా మేకప్ వేసుకోరు. వేసుకున్నా సెట్‌లోనికి రానివారు అనేకులు యీ తారలలో ఉన్నారు.

ఒక గొప్పతార యీ జాతకాల విషయంలో ఒక శాస్త్రిగారికి పదిహేను వేల రూపాయలు సమర్పించింది. ఆ శాస్త్రిగారు యీ డబ్బుతో వారి ఊరిలో గృహ నిర్మాణం చేసుకున్నట్టు తెలిసింది. ఆతారకు బిరుదులు వచ్చినా, సన్మానాలు జరుగుతున్నా, సభలలో మెప్పులు పొందుతున్నా యీమధ్య తాను నటించిన చిత్రాలు చూసి పొగడ్తలు, మెప్పులు కన్నా కొందరి దూషణలే ఎక్కువగా కనిపిస్తుంది. ఆ తారకు యీ విషయం జోతిష్యుడు చెప్పలేదో, ఆ జాతకాన్ని భగవంతుడు కూడా మార్చలేడని వారి అభిప్రాయమో తెలియకుండా ఉంది. శాస్త్రిగారికి యిచ్చిన పదిహేను వేల రూపాయలే బిరుదులు, సన్మానాలు, పొగడ్తలు, మెప్పులు విలువైతే ఆ తారపై ప్రజల అభిప్రాయం, వారి దూషణలకు విలువ కట్టలేమనిపిస్తుంది.

జాతకాలు అబద్ధమనికాదు. వాటిని నమ్మటం తప్పు అనీకాదు. తారలు లేకపోతే ఆకాశం ఎంత కళావిహీనంగా అవుతుందో, మన తారలు ఏ పెడదారులు పడితే పరిశ్రమ కూడా అలాగే కళావిహీనమవుతుంది. —సి. వైడిరాజు.






Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press, 6&7 Thambu chetty Street, Madras-1. Phones: Editorial, 21747, Other depts., 29766. Chief Editor: S. Sambhu Prasad.



బీబీ - కా - మాక్బరా, ఔరంగబద్.

ఫొటో. వి. ఆతు (కర్నూల్)

